# దేవదత్తం



మహాభాగవత మందలి "శ్రీకృష్ణుని జననఘట్టం." కృష్ణ జయంతి నాడు పఠిస్తే అపూర్వఫలం చేకూరి, ఆత్మకళ్యాణంతో పాటు లోక కళ్యాణం కూడ ప్రాప్తిస్తుందని ఆర్ష సిద్ధాంతం. హితైషులూ, ఆస్తికబుద్ధి సంపన్నులూ అగు శ్రీ సి. బి. వి. శాస్త్రి అడ్వకేట్, శ్రీ నండూరి నరసింహాచారి. శ్రీ జి. వరదరావు, శ్రీ ఆత్మూరి సూర్యనారాయణగార్ల అమూల్యప్రోత్సాహం కారణంగా ఆనాడే ఈఘట్టం ఆంధ్రీకరించాను. ముద్రణకై సమాలోచనలు సాగుతూండగానే యీవిషయం తెలిసీ తెలియటంతోనే శ్రీ ఆకివిళ్ళి వెంకటసత్యనారాయణమూర్తి (కాకరపర్రు) అందులకయే ద్రవ్యం ఇచ్చివేశారు,

చిన్నమాట: ఆకివిళ్ళవారి దౌహిత్రుడను నేను. పౌత్రుడు ఆయన. ఇరువురం ఈవిషయంలో కూడ కలియడం మాపెద్దల తపఃఫలమే ఔతుంది. నేను ఆంధ్రీకరించాను - మాబావ డబ్బు ఇచ్చారు - గ్రంథం తయారైంది. పాఠకులు భక్తిశ్రద్ధలతో పఠిస్తారు — అందరితోపాటూ మాకు కూడా శ్రీకృష్ణానుగ్రహం కలుగుతుందని మా ఆశయం.

కీ|| శే|| శ్రీ ఆకివిళ్ళ పెదవెంకటశాస్త్రిగారు నిరతాన్నదాతలు. నిరాడంబరులు. ఆకుటుంబం లక్ష్మీసరస్వతులకు నిలయమైంది. వారు కాకరపర్రులో హైస్కూలుకు ఐదుఎకరాలభూమి ఇచ్చారు. అనేక బీద కుటుంబీకులకు వివాహాలు చేశారు. ప్రాంతీయులనేకులు వారి సహాయం పొందినవారే. వారికి గ్రంథనాయకుడు నిత్యధామం ప్రసాదించుగాక.

ఆ కుటుంబంలో నేటికీ నిరతాన్నదానం, దైవకార్యాలూ సాగుతూనే ఉన్నాయి. ఉదారస్వభావులైన శ్రీ వెంకటసత్యనారాయణ దంపతులకూ, వారిపుత్ర పుత్రికా సంతానానికీ శ్రీకృష్ణుడు ఆయురారోగ్యైశ్వర్యములు ఇచ్చి రక్షించుగాక.

గ్రంథకర్త.

శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీ కృ ష్ణ జ న న ము.

## ప్రథమాధ్యాయము

శ్లో॥ నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమం
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయముదీరయేత్॥

మోక్షాసక్తుడైన పరీక్షిన్మహారాజు శుకయోగీంద్రునితో ఇలా పలుకుతున్నాడు—

శ్లో॥ కథితో వంశవిస్తారో భవతా సోమసూర్యయోః।
రాజ్ఞాం చోభయవంశ్యానాం చరితం పరమాద్భుతం॥ 1
యదోశ్చ ధర్మశీలస్య నితరాం మునిసత్తమ
తత్రాంశేనావతీర్ణస్య విష్ణోర్వీర్యాణి శంస నః॥ 2
అవతీర్య యదోర్వంశే భగవాన్ భూతభావనః
కృతవాన్యాని విశ్వాత్మా తాని నో వద విస్తరాత్॥ 3

---

యోగిపుంగవా— మీరు చంద్ర సూర్య వంశాలను గురించి సవిస్తరంగా చెప్పారు. ఆ రెండు వంశాలలోనూ జన్మించిన వారి విచిత్ర చరిత్రలు కూడా వివరించారు— మౌనిశేఖరా - ధర్మపరాయణులైన యదువంశరాజుల చరిత్రలు కూడా వినిపించారు ఈవంశంలోనే తనఅంశచే జనించిన మహావిష్ణువుయొక్క చరిత్ర నాకు వినిపించండి. సర్వజీవ పరిపాలకుడైన శ్రీహరి లీలలు వివరించి నన్ను ధన్యుణ్ణి చేయండి.

# దేవదత్తం



మహాభాగవత మందలి "శ్రీకృష్ణుని జననఘట్టం." కృష్ణ జయంతి నాడు పఠిస్తే అపూర్వఫలం చేకూరి, ఆత్మకళ్యాణంతోపాటు లోక కళ్యాణం కూడ ప్రాప్తిస్తుందని ఆర్ష సిద్ధాంతం. హితైషులూ, ఆస్తికబుద్ధి సంపన్నులూ అగు శ్రీ సి. బి. వి. శాస్త్రి అడ్వకేట్, శ్రీ నంబూరి నరసింహాచారి, శ్రీ జి. వరదరావు, శ్రీ ఆత్మూరి సూర్యనారాయణగార్ల అమూల్యప్రోత్సాహం కారణంగా ఆనాడే ఈఘట్టం ఆంధ్రీకరించాను. ముద్రణకై సమాలోచనలు సాగుతూండగానే యీవిషయం తెలిసీ తెలియటంతోనే శ్రీ ఆణివిళ్ళి వెంకటసత్యనారాయణమూర్తి (కాకరపర్రు) అందులకయే ద్రవ్యం ఇచ్చివేశారు,

చిన్నిమాట : ఆణివిళ్ళ వారి దౌహిత్రుడను నేను. పౌత్రుడు ఆయన. ఇరువురం ఈవిషయంలో కూడ కలియడం మాపెద్దల తపఃఫలమే ఔతుంది. నేను ఆంధ్రీకరించాను - మాబావ డబ్బు ఇచ్చారు - గ్రంథం తయారైంది. పాఠకులు భక్తిశ్రద్ధలతో పఠిస్తారు — అందరితోపాటూ మాకు కూడా శ్రీకృష్ణానుగ్రహం కలుగుతుందని మా ఆశయం.

కీ॥ శే॥ శ్రీ ఆణివిళ్ళ పెదవెంకటశాస్త్రిగారు నిరతాన్నదాతలు. నిరాడంబరులు. ఆకుటుంబం లక్ష్మీసరస్వతులకు నిలయమైంది. వారు కాకరపర్రులో హైస్కూలుకు ఐదుఎకరాలభూమి ఇచ్చారు. అనేక బీద కుటుంబీకులకు వివాహాలు చేశారు. ప్రాంతీయు లనేకులు వారి సహాయం పొందినవారే. వారికి గ్రంథనాయకుడు నిత్యధామం ప్రసాదించుగాక.

ఆ కుటుంబంలో నేటికీ నిరతాన్నదానం, దైవకార్యాలూ సాగుతూనే ఉన్నాయి. ఉదారస్వభావులైన శ్రీ వెంకటసత్యనారాయణ దంపతులకూ, వారిపుత్ర పుత్రికా సంతానానికీ శ్రీకృష్ణుడు ఆయు రారోగ్యఐశ్వర్యములు ఇచ్చి రక్షించుగాక.

గ్రంథకర్త.

శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీ కృష్ణ జ న న ము.

## ప్రథమాధ్యాయము

శ్లో॥ నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమం
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయముదీరయేత్॥

మోక్షాసక్తుడైన పరీక్షిన్మహారాజు శుకయోగీంద్రుని తో ఇలా పలుకుతున్నాడు—

శ్లో॥ కథితో వంశవిస్తారో భవతా సోమసూర్యయోః।
రాజ్ఞాం చోభయవంశ్యానాం చరితం పరమాద్భుతం॥ 1
యదోశ్చ ధర్మశీలస్య నితరాం మునిసత్తమ
తత్రాంశేనావతీర్ణస్య విష్ణోర్వీర్యాణి శంస నః॥ 2
అవతీర్య యదోర్వంశే భగవాన్ భూతభావనః
కృతవాన్యాని విశ్వాత్మా తాని నో వద విస్తరాత్॥ 3

---

యోగిపుంగవా— మీరు చంద్ర సూర్య వంశాలను గురించి సవిస్తరంగా చెప్పారు. ఆ రెండు వంశాలలోనూ జన్మించిన వారి విచిత్ర చరిత్రలు కూడా వివరించారు— మౌనిశేఖరా - ధర్మపరాయణులైన యదువంశరాజుల చరిత్రలు కూడా వినిపించారు ఈవంశంలోనే తనఅంశచే జనించిన మహావిష్ణువుయొక్క చరిత్ర నాకు వినిపించండి. సర్వజీవ పరిపాలకుడైన శ్రీహరి లీలలు వివరించి నన్ను ధన్యుణ్ణి చేయండి.

నివృత్తతర్షై రుపగీయమానాత్
భవౌషధాచ్ఛ్రోత్రమనోఽభిరామాత్
క ఉత్తమశ్లోకగుణానువాదాత్
పుమాన్విరజ్యేత వినా పశుఘ్నాత్॥ 4

పితామహా మే సమరేఽమరంజయై
ర్దేవవ్రతాద్యాతిరథైస్తిమింగిలైః
దురత్యయం కౌరవసైన్యసాగరం
కృత్వాతరన్వత్సపదం స్మ యత్ప్లవాః॥ 5

ద్రౌణ్యస్త్రవిప్లుష్టమిదం మదఙ్గం
సంతానబీజం కురుపాండవానాం
జుగోప కుక్షిం గత ఆత్తచక్రో
మాతుశ్చ మే యః శరణం గతాయాః॥ 6

---

జీవన్ముక్తులైన మహాత్ములుకూడా ఎవనికీర్తిని గానం చేస్తూ ఉంటారో, ముముక్షువులకు ఎవని లీలాభూయిష్టమైన చరిత్ర ఏకైకమైన దివ్యౌషధమో; విషయాసక్తులైన మానవులు కూడా ఎవని చరిత్రను ఆనందంతో వింటూ ఉంటారో, అట్టి శ్రీహరి గుణానుకీర్తన శ్రవణములు ఆత్మఘాతీ పశుహింసకుడూ తప్ప ఏవరు వినకుండా ఉంటారు. నా పితామహులైన పాండవులు భీష్మద్రోణు లనే తిమింగిలాలతో కూడిన కౌరవసైన్యరూపమైన మహాసముద్రాన్ని గోపాదంతో సమానంగా శ్రీకృష్ణుడు అనే నౌకను ఆధారం చేసుకుని తరించారు. నేను నాతల్లిగర్భంలోఉండగా అశ్వ

వీర్యాణి తస్యాఖిలదేహభాజా
మంతర్బహిః పూరుషకాలరూపైః
ప్రయచ్ఛతో మృత్యుముతామృతం చ
మాయామనుష్యస్య వదస్య విద్వన్॥ 7
రోహిణ్యాస్తనయః ప్రోక్తో రామః సంకర్షణస్త్వయా
దేవక్యా గర్భసంబంధః కుతో దేహాంతరం వినా॥ 8
కస్మాన్ముకుందో భగవాన్పితుర్గేహాద్వ్రజం గతః
క్వ వాసం జ్ఞాతిభిః సార్థం కృతవాన్సాత్వతాంపతిః॥ 9
వ్రజే వసన్కిమకరోన్మధుపుర్యాం చ కేశవః
భ్రాతరం చావధీత్కంసం మాతురద్ధాతదర్హణం॥ 10

---

త్థామ, బ్రహ్మాస్త్ర ప్రయోగం చేస్తే కౌరవ పాండవ వంశ బీజమైన నా దేహం దగ్ధం ఐపోయింది. ఆ సమయంలో నాతల్లి శరణంటే ఆమెగర్భంలో ప్రవేశించి సుదర్శన చక్రంతో తక్షణమే రక్షించాడు. దేహధారు లందరి హృదంతరాళాలలో అంతర్యామి రూపంలో జీవుడుగానూ బాహ్యమందు కాలరూపంతో మృత్యువుగానూ ఉండి జీవనమునూ మృత్యువునూ ప్రసాదిస్తూ ఉండే ఆ మాయా మానుష వేషధారు డగు శ్రీకృష్ణుని లీలలను సవిస్తరంగా చెప్పండి—

దేహధారుల అందరి అంతఃకరణంలోనూ అంతర్యామిగా ఉండి వారికి జీవనకారణము ఔతున్నాడు. బాహ్యమందు కాలరూపంలో ఉండి దేహాలను అన్నిటినీ నశింప

దేహం మానుషమాశ్రిత్య కతి వర్షాణి వృష్ణిభిః
యదుపుర్యాం సహావాత్సీత్పత్న్యః కత్యభవత్ప్రభోః॥
ఏతదన్యచ్చ సర్వం మే మునే కృష్ణవిచేష్టితం
వక్తుమర్హసి సర్వజ్ఞ శ్రద్ధధానాయ విస్తృతం॥ 12
నైషాతిదుఃసహా క్షున్మాం త్యక్తోదమపి బాధతే
పిబన్తం త్వన్ముఖాంభోజచ్యుతం హరికథామృతం॥ 13

సూతఉవాచ.

ఏవం నిశమ్య భృగునందన సాధువాదం
వైయాసికః స భగవానథ విష్ణురాతం
ప్రత్యర్చ్య కృష్ణచరితం కలికల్మషఘ్నం
వ్యాహర్తుమారభత భాగవతప్రధానః॥ 14

---

చేస్తున్నాడు. కనుకనే ఆత్మజ్ఞానులు అంతర్యామియైన భగవంతుణ్ణే ఉపాసించి అమరత్వం పొందుతున్నారు. విషయాసక్తులైన అజ్ఞానులు బాహ్య దృష్టితో విషయ సుఖాలనే వాంఛిస్తూ ఉంటారు గనుక వారు జనన మరణ రూపమైన కాలచక్రంలో పడి తిరుగుతూ ఉంటారు.

యోగిజనవంద్యా—మీరు నవమస్కంధంలో బలరాముడు రోహిణీ పుత్రుడని తిరిగి దేవకీనందనుడనీ చెప్పారు. రెండవ దేహం ధరించకుండా బలరాముడు దేవకీ పుత్రుడు ఎలా అయాడు. ఇదే గాక శ్రీకృష్ణుడు పితృగృహం విడిచి వ్రజభూమికి ఎందుకు వెళ్ళేడో సజాతీయులు అగు సోదర సహితంగా యెక్కడెక్కడ వసించాడో వ్రజమండలిలోనూ

శ్రీశుక ఉవాచ.

సమ్యగ్వ్యవసితా బుద్ధిస్తవ రాజర్షిసత్తమ
వాసుదేవకథాయాం తే యజ్జాతా నైష్ఠికీ రతిః॥ 15
వాసుదేవకథాప్రశ్నః పురుషాంస్త్రీన్పునాతి హి
వక్తారం పృచ్ఛకం శ్రోతౄంస్తత్పాదసలిలం యథా॥
భూమిర్దృప్తనృపవ్యాజదైత్యానీకశతాయుతైః
ఆక్రాంతా భూరిభారేణ బ్రహ్మాణం శరణం యయౌ॥
గౌర్భూత్వాశ్రుముఖీ ఖిన్నా క్రందంతీ కరుణం విభోః
ఉపస్థితాన్తికే తస్మై వ్యసనం స్వమవోచత॥ 18
బ్రహ్మా తదుపధార్యాథ సహ దేవైస్తయా సహ
జగామ సత్రినయనస్తీరం క్షీరపయోనిధేః॥ 19

---

మధురానగరిలోనూ వాసుదేవుడు ఏ ఏ లీలలు ప్రదర్శించాడో మేనమామ ఐన కంసుని ఎందుకుసంహరించాడో మానవదేహం ధరించి భగవానుడు యాదవులతో ఎంత కాలం సంచరించాడో శ్రీకృష్ణునకు భార్యలెందరో నాకు వివరంగా మీరు చెప్పాలి. స్వహస్తాలతో మేనమామను సంహరించటం ఉచితం గాదేమో అని నాకు తోస్తూంది. మీరు సర్వజ్ఞులు కనుక నాసందేహాలు మీరే తీర్చాలి. శ్రీకృష్ణచరిత్ర వినాలని నాకు కుతూహలంగా ఉంది. అన్న పానాదులు వర్జించినా హరికథామృతపానంవల్ల ఆకలిదప్పికలు నశించి హరికథాశ్రవణమే చేయాలని ఉంది. నాకు దేనియందూ వాంఛ లేదు. అన్నాడు పరీక్షిత్తు—

రాజధానీ తతః సాభూత్సర్వయాదవభూభుజాం
మథురా భగవాన్యత్ర నిత్యం సన్నిహితో హరిః॥ 28
తస్యాం తు కర్హిచిచ్ఛౌరిర్వసుదేవః కృతోద్వహః
దేవక్యా సూర్యయా సార్ధం ప్రయాణే రథమారుహత్॥
ఉగ్రసేనసుతః కంసః స్వసుః ప్రియచికీర్షయా
రశ్మీన్హయానాం జగ్రాహ రౌక్మై రథశతైర్వృతః॥ 30
చతుఃశతం పారిబర్హం గజానాం హేమమాలినాం
అశ్వానామయుతం సార్ధం రథానాం చ త్రిషట్శతం॥
దాసీనాం సుకుమారీణాం ద్వే శతే సమలఙ్కృతే
దుహిత్రే దేవకః ప్రాదాద్యానే దుహితృవత్సలః॥ 32

---

హించాడు. భూమియొక్క దీనావస్థను గుర్తించాడు. శ్రీహరి తనకాలశక్తితో భూభారం హరిస్తాడు. లీలాగృహీతశరీరుడై భూలోకంలో విహరించుతూ ఉండే కాలంలో మీరు యదు వంశంలో అవతరించి శ్రీహరికి అనుచరులుగా సంచరించండి. సాక్షాత్తు నారాయణుడు వసుదేవనందనుడుగా యదువంశంలో అవతరిస్తాడు. ఆ శ్రీహరికి ప్రీతి కల్గించుటకు దేవాంగన లందరూ భూమిపై జన్మిస్తారు. వాసుదేవుని కళాంశ సంభవుడూ స్వయంప్రకాశుడూ సహస్రఫణిమండలుడూ అగు శేషుడు కూడ శ్రీహరికంటె ముందుగానే భూమియందు అవతరిస్తాడు. జగత్తును అంతనూ మోహింపజేయు పరమ ఐశ్వర్యశాలినియైన విష్ణుమాయ కూడా శ్రీహరికి ప్రియం చేకూర్చుటకు భూమిపై అవతరిస్తుంది''-అని దేవతలకు చెప్పారు.

శంఖతూర్యమృదంగాశ్చ నేదుర్దుందుభయః సమం
ప్రయాణప్రక్రమే తావద్వరవధ్వోః సుమంగళం॥ 33
పథి ప్రగ్రహిణం కంసమాభాష్యాహాశరీరవాక్
అస్యాస్త్వామష్టమో గర్భో హన్తా యాం వహసేఽబుధ॥
ఇత్యుక్తః స ఖలః పాపో భోజానాం కులపాంసనః
భగినీం హన్తుమారబ్ధః ఖడ్గపాణిః కచేఽగ్రహేత్॥ 35
తం జుగుప్సితకర్మాణం నృశంసం నిరపత్రపం
వసుదేవో మహాభాగ ఉవాచ పరిసాన్త్వయన్॥ 36

---

చతుర్ముఖుడు దేవతలకు ఆదేశాలు ఇచ్చిన అనంతరం భూదేవికి ధైర్యం చెప్పి సత్యలోకానికి పయనించాడని శుక యోగి హరిలీలాకథనం చేస్తూ ముందుకు సాగుతున్నాడు.

పరీక్షిన్మహారాజా — అప్పుడు భూలోకంలో ఆ కాలంలో ఏ జరిగిందో చెపుతాను. సావధానంగా విను. శూరసేనుడనే మహారాజు యదు వంశంలో జన్మించాడు. ఏ నగరంలో శ్రీహరి సర్వదా విరాజిల్లాడో ఆ మథురా నగరాన్నే రాజధానిగా చేసుకొని మాథుర శూరసేన దేశాలను పరిపాలిస్తున్నాడు ఆ శూరసేనుడు. యాదవులందరకూ మథురానగరమే రాజధాని.

ఒకానొకప్పుడు ఆ నగరంలో వసుదేవుడు దేవకిని పరిణయమాడాడు. తన గృహానికి ప్రయాణోన్ముఖుడై పత్నీ సమేతంగా రథారోహణం చేసాడు— చెల్లెలు అగు దేవకిని అత్తవారింటికి పంపునపుడు చెల్లెలియందుండే ప్రేమాతిశయం

వసుదేవఉవాచ.

శ్లాఘనీయగుణః శూరైర్భవాన్భోజయశస్కరః
స కథం భగినీం హన్యాత్స్త్రియముద్వాహపర్వణి॥ 37
మృత్యుర్జన్మవతాం వీర దేహేన సహ జాయతే
అద్య వాబ్దశతాన్తే వా మృత్యుర్వై ప్రాణినాం ధ్రువః॥
దేహే పంచత్వమాపన్నే దేహీ కర్మానుగోఽవశః
దేహాన్తరమనుప్రాప్య ప్రాక్తనం త్యజతే వపుః॥ 39

---

చేత ఉగ్రసేన పుత్రుడైన కంసుడు స్వయంగా సారథ్యం వహించాడు. అనేక రథాలు చీనిచీనాంబరాలతో అమూల్య ఆభరణాలతో వారి రథాన్ని అనుసరించాయి. పుత్రికా వాత్సల్యం కల దేవకుడు అత్తవారింటికి కుమార్తెను పంపు నప్పుడు స్వర్ణమాలా లంకృతములైన నాలుగువందల ఏనుగు లనూ పదిహేను వందల గుర్రాలను పద్దెనిమిది వందల రథాలనూ సర్వాలంకార భూషితలైన రెండు వందల దాస స్త్రీలనూ కానుకగా యిచ్చాడు. వధూవరులు పెద్దలకు నమస్కరించి ఆశీర్వచనాలు పొంది పయనం సాగిస్తూ ఉండగా శంఖ తూర్య మృదంగ దుందుభి మొదలగు మంగళ ధ్వనులు మిన్ను ముట్టాయి. కంసుడు కళ్ళాలుపట్టి తోలు కర్రను చేతధరించి అశ్వాలను అదలించాడు. సుశిక్షితమైన ఆ అశ్వాలు మంగళప్రదంగా గమనం సాగించాయి. నగరాలు గతిస్తున్నాయి పల్లెలు వెనుకపడుతున్నాయి. వనాలు స్వాగతాలు పలుకుతున్నాయి — ఇలా ప్రయాణం

వ్రజం స్తిష్ఠన్పదైకేన యథైవైకేన గచ్ఛతి
యథా తృణజలూకైవం దేహీ కర్మగతిం గతః॥ 40

స్వప్నే యథా పశ్యతి దేహమీదృశం
మనోరథేనాభినివిష్టచేతనః
దృష్టశ్రుతాభ్యాం మనసానుచిన్తయన్
ప్రపద్యతే తత్కిమపి హ్యపస్మృతిః॥ 41

---

సాగుతూ ఉండగా అశరీరవాణి "ఓరీ మూర్ఖ! నీవు యెవరినైతే ప్రేమాతిరేకంతో దగ్గరఉండి తీసికొని వెళుతున్నావో ఆ దేవకి అష్టమగర్భమందుజనించిన బాలుడే నీకు మారకుడు ఔతాడు" అని పలుకగా హఠాత్తుగా రథం ఆపి క్రిందకు దిగి నిలచాడు కంసుడు. దుష్టుడూ, మహాపాపి, భోజకుల కళంకుడూ ఐన కంసుడు వెంటనే వరనుండి ఖడ్గంలాగి దేవకిని సంహరించడానికి ఉద్యుక్తుడై ఆమె కేశపాశాన్ని పట్టి లాగాడు. సిగ్గులేకుండా స్త్రీ అందులోనూ చెల్లెలు అనే విచారణ లేకుండా క్రూరంగా నింద్యకర్మకు సంసిద్ధుడైన కంసుని చూచి కుశాగ్రబుద్ధి యగు వసుదేవుడు ఆతనిని అనునయిస్తూ యిలా పలికాడు.

కంస- నీవు భోజవంశకీర్తిని వృద్ధి చేశావు. శూరులూ వీరులూ నీ యశోగానం చేస్తున్నారు. నీ గుణగణాలను కీర్తిస్తున్నారు. అట్టి ప్రఖ్యాతి నొందిన నీవు నూతన వధువును ఈ శుభ సమయంలో సంహరించడానికి [illegible]

యతో యతో ధావతి దైవచోదితం
మనో వికారాత్మకమాప పంచసు
గుణేషు మాయారచితేషు దేహ్యసౌ
ప్రపద్యమానః సహ తేన జాయతే॥ 42
జ్యోతిర్యథైవోదకపార్థివేష్వదః
సమీరవేగానుగతం విభావ్యతే
ఏవం స్వమాయారచితేష్వసౌ పుమాన్
గుణేషు రాగానుగతో విముహ్యతి॥ 43

---

సంసిద్ధుడవు అవుతావు — యీమె నీ సహోదరి కాదా? వీరపురుష! జనించిన ప్రతి వారికి నేడో, నూరు సంవత్సరాలకో ఎప్పుడో ఒకప్పుడు మరణం తప్పదు గదా! జననంతోపాటు మరణం తథ్యమనేది త్రికాలాబాధ్యమానమైన సత్యమే కదా! ఈ శరీరం అంతం కావడంతో కర్మానుసారం జీవికి మరొక శరీరం లభిస్తుంది. దేహాభిమానం కల జీవుడు కర్మచే వివశుడై యీ దేహాన్ని వదలి మరొక దేహంలో ప్రవేశిస్తూ ఉంటాడు. నడచునప్పుడు ఒక కాలు భూమిపై ఆని మరొక కాలు పైకెత్తినట్లూ, తృణజలూక ఒక ఆకుమీదనుంచి రెండవ ఆకు స్వాధీనం చేసుకొనిగాని ఆకును వదలివేసినట్లు ప్రవర్తించదు. జీవి ఒక దేహాన్నుండి మరొక దేహాన్ని పొందుతూ ఉంటాడు. మానవుడు విన్న విషయాలనూ చూచిన పదార్థాలనూ నిరంతరం స్మరించడం వల్ల ఆ పదార్థాలే స్వప్నావస్థ యందు కూడ కనబడతాయి.

తస్మాన్న కస్యచిద్ద్రోహమాచరేత్స తథావిధః
ఆత్మనః క్షేమమన్విచ్ఛన్ద్రోగ్ధుర్వై పరతో భయమ్॥ 44
ఏషా తవానుజా బాలా కృపణా పుత్రికోపమా
హన్తుం నార్హసి కళ్యాణీమిమాం త్వం దీనవత్సలః॥ 45

శ్రీశుక ఉవాచ.

ఏవం స సామభిర్భేదైర్బోధ్యమానోఽపి దారుణః
న న్యవర్తత కౌరవ్య పురుషాదాననువ్రతః॥ 46

---

వాటికి అనుగుణమైన దేహాలను చూస్తూ ఉండి వాటియందున్న సంకల్పం ద్వారా ఆత్మభావం కలిగి ఉండడంవల్ల జాగ్రదవస్థలో ఉండే దేహాన్నే మరచిపోతున్నాడు. అనేక తరగతులకు చెందిన కోరికలు కారణంగా దేహాంతరప్రాప్తి కలిగినప్పుడు జీవి ఆ దేహంయందే దృఢమైన అభిమానం కలవాడై పూర్వశరీరాన్ని మరచి పోతున్నాడు. అంత్యకాలం సమీపించడంతోటే అనేక వికారాలతో ఉండే మనస్సు, ప్రేరబ్ధకర్మయొక్క ప్రేరణవల్ల, మాయాకల్పితమైన పంచభూతసంబంధమగు శరీరాలనుచూసి మోహం చెంది పరువిడుతుంది ఆసమయంలో జీవియొక్క కర్మాను సారం ఏదో ఒక శరీరం లభిస్తుంది. ఆ శరీరమందే ఆత్మ భావం కలవాడై జీవుడు ఆ శరీరంతోటే జన్మిస్తాడు. సూర్య చంద్రాది జ్యోతిర్మండలాలు జల తైలాదులలో ప్రతిబింబించినప్పుడు గాలిచే ఆ జలతైలాదులు చలిస్తే యీ సూర్య చంద్ర బింబాలు కూడా చలిస్తూ ఉన్నట్లు కనిపిస్తాయి.

నిర్బంధం తస్య తం జ్ఞాత్వా విచిన్త్యానకదుందుభిః
ప్రాప్తం కాలం ప్రతివ్యోఢుమిదం తత్రాన్వపద్యత॥ 47
మృత్యుర్బుద్ధిమతాపోహ్యో యావద్బుద్ధిబలోదయమ్
యద్యసౌ న నివర్తేత నాపరాధో౽స్తి దేహినః॥ 48
ప్రదాయ మృత్యవే పుత్రాన్మోచయే కృపణామిమాం
సుతా మే యది జాయేరన్మృత్యుర్వా న మ్రియేత చేత్॥
విపర్యయో వా కిం న స్యాద్గతిర్ధాతుర్దురత్యయా
ఉపస్థితో నివర్తేత నివృత్తః పునరాపతేత్॥ 50

---

అదేవిధంగా జీవుడు తన మాయాకల్పిత విషయాలయందు అనురక్తుడు అగుటచే మోహం చెందుతున్నాడు. కనుక కళ్యాణ వాంఛ గల మానవుడు యే జీవికీ ద్రోహం చేయ కూడదు. ఒకరిని ద్వేషించే వానికే ఇతరులవల్ల భయం కలుగుతుంది. నీ సోదరి పిన్నవయస్సు కలది. దీనురాలగు యీమె నీకు పుత్రికతో సమానమైనది. దీనులను రక్షించే వాడవు నువ్వు. వివాహ చిహ్నలతో ఉన్న ఈ మంగళాంగిని హత్య చెయ్యడం నీలాంటి ధీరునకు ఉచితం కాదు—— అని వసుదేవుడనేక విధాల కంసునకు ప్రబోధించాడు అని కథా క్రమంలో శ్రీశుకుడు ముందుకు ఈలా సాగుతున్నాడు.

మహారాజా —— వసుదేవుడు సామ భేదోపాయాలతో ఎన్నో విధముల కంసునకు బోధించినప్పటికీ రాక్షస ప్రవృత్తి కలవాడగుటవల్ల కంసుడు తన దుర్మార్గాన్ని విడువ లేక పోయాడు. వాని క్రూరహృదయం ద్రవించ లేదు. అది

అగ్నేర్యథా దారువియోగయోగయో
రదృష్టతోఽన్యన్న నిమిత్తమస్తి
ఏవం హి జన్తోరపి దుర్విభావ్యః
శరీరసంయోగవియోగహేతుః॥ 51

ఏవం విమృశ్య తం పాపం యావదాత్మనిదర్శనమ్
పూజయామాస వై శౌరిర్బహుమానపురస్సరమ్॥ 52
ప్రసన్నవదనామ్భోజో నృశంసం నిరపత్రపం
మనసా దూయమానేన విహసన్నిదమబ్రవీత్॥ 53

---

చూచి వసుదేవుడు తన బుద్ధి బలంతో "మృత్యువును జయించడానికి తన ఆలోచనలు ఎంతవరకూ పనిచేస్తాయో అంతవరకూ మానవుడు ప్రయత్నం చేస్తూనే ఉండాలి. తన ప్రయత్నమునకు మించినప్పుడు వాని దోషం ఏమీ లేదు. కనుక నేను ఈమెకు కలిగే సంతానాన్ని వీని అధీనం చేస్తానని వాగ్దత్తంచేసి ఈ అబలను రక్షిస్తాను. నాకు సంతానం కలిగే వరకూ యీ కంసుడు జీవించి ఉంటే యింత కంటె అప్పుడు కలిగే విపరీతం ఏమీ లేదు. మృత్యురూపుడైన కంసుని బారినుండి తప్పించుకొనుటకు ఇంతకంటె వేరే ఉపాయం లేదు, విధాత చేతలు దుర్గమమైనవి, వానిని ఎవడు నిర్ణయం చేయగలడు? ప్రస్తుతానికి మృత్యువును దాటవచ్చును కదా! తిరిగి మృత్యువు వస్తే రావచ్చు. కాష్ఠం యందు అగ్నియొక్క సంయోగం కలుగుట, కలుగక పోవుట అనేది యెలాగైతే అదృష్టం మీద ఆధారపడి

వసుదేవ ఉవాచ.

నహ్యస్యాస్తే భయం సౌమ్య యద్వై సాహాశరీరవాక్
పుత్రాన్సమర్పయిష్యేఽస్యా యత స్తే భయముత్థితమ్॥

శ్రీశుక ఉవాచ.

స్వసుర్వధాన్నివవృతే కంస స్తద్వాక్యసారవిత్
వసుదేవోఽపి తం ప్రీతః ప్రశస్య ప్రావిశద్గృహమ్॥ 55
అథ కాల ఉపావృత్తే దేవకీ సర్వదేవతా
పుత్రాన్ప్రసుషువే చాష్టౌ కన్యాం చైవానువత్సరమ్॥

---

ఉంటుందో అదే విధంగా జీవునకు శరీరంతో సంయోగ వియోగాలు అచింత్యంగానే ఉంటాయి, (అరణ్యం అంతా దగ్ధమయ్యే సమయంలో సమీపంలో ఉండే ఒక వృక్షం తగులబడక పోవడమూ దూరంగా ఉండే మరో వృక్షం దగ్ధం కావటం జరుగుతోంది. దీనికి అదృష్టం కాక ఇతర కారణం ఏ ముంటుంది?) అలాగే మానవులు జీవించడానికీ మరణించడానికీ కూడా అదృష్టంకంటే ఇతర కారణం కనిపించదు. చావు బ్రతుకులు యుక్తివాదంతో సిద్ధాంతం చేయుటకు అవకాశం లేదు.'' అని ఆలోచించి హృదయ వేదన పైకి వెల్లడి కాకుండా చిరు నవ్వుతో లజ్జాహీనుడైన కంసునితో ఇలా చెప్పాడు.

సౌమ్యుడా ఆకాశవాణి వాక్యాలు పరిశీలిస్తే దేవకి వల్ల నీకు కలిగే ప్రమాదం ఏమీ లేదు. ఆమె సంతానం వల్ల కదా నీకు మరణం కలుగు తుందనే సంశయం! కనుక

కీర్తిమన్తం ప్రథమజం కంసాయానకదుందుభిః
అర్పయామాస కృచ్ఛ్రేణ సోఽనృతాదతివిహ్వలః॥ 57
కిం దుస్సహం ను సాధూనాం విదుషాం కిమపేక్షితమ్
కిమకార్యం కదర్యాణాం దుస్త్యజం కిం ధృతాత్మనామ్॥
దృష్ట్వా సమత్వం తచ్ఛౌరేః సత్యే చైవ వ్యవస్థితిమ్
కంసస్తుష్టమనా రాజన్ప్రహసన్నిదమబ్రవీత్॥ 59
ప్రతియాతు కుమారోఽయం నహ్యస్మాదస్తి మే భయమ్
అష్టమాద్యువయోర్గర్భాన్మృత్యుర్మే విహితః కిల॥ 60

---

ఆమెకు కలిగే సంతానాన్ని అందరనూ నీ అధీనం చేస్తాను. ఆమెను వదలివేయుమని వసుదేవుడు చెప్పగా కంసుడు దేవకిని సంహరించడం మానివేశాడు. దేవకీవసుదేవులూ కంసుడూ తమ తమ గృహాలు చేరారు.

అనంతరం కథాక్రమాన్ని శ్రీశుకుడు పరీక్షిన్మహారాజుకు ఈలా చెప్ప నారంభించాడు.

కాలక్రమంలో సర్వదేవమయురాలైన దేవకియందు సంవత్సరానికి ఒక్కరుగా ఎనమండుగురు పుత్రులూ ఒక పుత్రిక కలిగారు. పుత్రశోకాన్ని దిగమ్రింగి వసుదేవుడు తన ప్రథమ సంతానమైన కీర్తిమానుడనే కుమారుని కంసునకు ఇచ్చివేశాడు. సత్యసంధుడైన వసుదేవుడు అసత్యముకు భయంచెందునట్లు మరి దేనికీ భయపడడు. సాధుపురుషులు ధర్మరక్షణకు ఎంత కష్టాన్నైనా సహిస్తారు. జ్ఞానులు ఏ వస్తువునూ వాంఛించరు. నీచ పురుషులు ఎట్టి

తథేతి సుతమాదాయ యయావానకదుందుభిః
నాభ్యనన్దత తద్వాక్యమసతోఽవిజితాత్మనః॥ 61
నన్దాద్యా యే వ్రజే గోపా యాశ్చామీషాం చ
యోషితః
వృష్ణయో వసుదేవాద్యా దేవకాద్యా యదుస్త్రియః॥
సర్వే వై దేవతాప్రాయా ఉభయోరపిభారత
జ్ఞాతయో బంధుసుహృదో యే చ కంసమనువ్రతాః॥

---

దుర్మార్గమునైనా చేస్తారు. అలాంటప్పుడు జితేంద్రియులైన వారు దేన్నైనా సరే సత్యం కొరకు యెందుకు త్యజించ లేరు ? వసుదేవుని సత్యసంధత సమత్వబుద్ధి చూచి కంసుడు ఇలా పలికాడు :

వసుదేవా ! నీ సత్యప్రతిజ్ఞకు ఆనందించాను. దేవకి అష్టమగర్భంవల్లనే గాని ఈ బాలునివల్ల నాకు మరణం లేదు కనుక నీవీ బాలుని తీసికొని వెళ్ళమని చెప్పగా వసుదేవుడు ఆనందతరంగాలలో ఉయ్యాల లూగాడు. వెంటనే ఆ బాలకునితో గృహం చేరాడు. కాని కంసుని మాట యందు వసుదేవునకు విశ్వాసం లేదు. కంసుడు మహా దుష్టుడగుటవల్ల వాని మనస్సు వానివశంలో ఉండ దని వసుదేవుడు గుర్తించాడు.

ఇలా కాలం యాపన అవుతూంటే ఒకనాడు నారద మహర్షి కంసునివద్దకు వచ్చి సత్కారాలు గ్రహించి సుఖా

ఏతత్కంసాయ భగవాఞ్ఛశంసాభ్యేత్య నారదః
భూమేర్భారాయమాణానాం దైత్యానాం చ
వధోద్యమమ్॥

ఋషేర్వినిర్గమే కంసో యదూన్మత్వా సురానితి
దేవక్యా గర్భసంభూతం విష్ణుం చ స్వవధం ప్రతి॥ 65
దేవకీం వసుదేవం చ నిగృహ్య నిగడైర్గృహే
జాతం జాతమహన్పుత్రం తయోరజనశంకయా॥ 66

---

సీనుడై కంసునితో "వ్రజ భూమియందలి నందాది గోపకులు వారి స్త్రీలు వృష్ణి వంశీయులైన వసుదేవాదులు దేవకి మొదలైన యదువంశ స్త్రీలు నిన్ను సేవించే వీరంతరూ కూడ దేవతాస్వరూపులే. ఈ రెండు వంశాలకూ సంబంధం ఉన్నంతవరకూ బంధు మిత్రాదులంతా దేవాంశసంభవులే. రాక్షసులను సంహరించి, భూ భారం హరియించుటకే ఏర్పాటైన దేవతా ఉద్యమం యిది"-అని చెప్పి వెళ్ళిపో యాడు నారదుడు.

అనంతరం కంసుడు నారద వాక్యాలు మననం చేస్తూ యాదవులంతా దేవతలే అనీ, దేవకీ గర్భసంజాతుల వల్ల తనకు మరణం నిశ్చయమే అనీ, దేవకి సంతానం అంతా విష్ణువుయొక్క అంశలే అనీ, శ్రీమన్నారాయణుడే స్వయంగా దేవకి అష్టమగర్భాన అవతరించి తన్ను సంహరిస్తాడనీ కంసుడు నిశ్చయించుకొని దేవకీవసుదేవులను

మాతరం పితరం భ్రాతౄన్సర్వాంశ్చ సుహృదస్తథా
ఘ్నన్తి హ్యసుతృపో లుబ్ధా రాజానః ప్రాయశో భువి॥
ఆత్మానమిహ సంజాతం జానన్ప్రాగ్విష్ణునా హతమ్
మహాసురం కాలనేమిం యదుభిః స వ్యరుధ్యత॥ 68
ఉగ్రసేనం చ పితరం యదుభోజాన్ధకాధిపమ్
స్వయం నిగృహ్య బుభుజే శూరసేనాన్మహాబలః॥ 69
ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే పూర్వార్ధే
శ్రీకృష్ణావతారోపక్రమే ప్రథమోఽధ్యాయః॥

---

కారాగారంలో బంధించాడు. జన్మించిన ప్రతి శిశువునూ సంహరించడం ఆరంభించాడు. తను పూర్వజన్మలో కాలనేమి నచే వృత్తాంతం కంసునకు తెలుసు. జన్మాంతరంలో శ్రీహరి హస్తంలో మరణించి తిరిగి ఇలా జన్మించినట్లు గూడా గ్రహించినవాడగుటవల్లనే యాదవు లందరితోనూ వైరం కల్పించుకొన్నాడు కంసుడు. అంతేగాక యదు భోజ అంధక వంశవీరులందరకూ ప్రభువూ తనకు తండ్రీ అయిన ఉగ్రసేన మహారాజును గూడ బంధించి నిష్కంటకంగా శూరసేన దేశాన్ని పాలించడం ఆరంభించాడు.

ఇది ప్రథమాధ్యాయం.

# ద్వితీయాధ్యాయము

శ్రీశుక ఉవాచ.

ప్రలంబబకచాణూరతృణావర్తమహాశనైః
ముష్టికారిష్టద్వివిదపూతనాకేశిధేనుకైః॥ 1
అన్యైశ్చాసురభూపాలైర్బాణభౌమాదిభిర్యుతః
యదూనాం కదనం చక్రే బలీ మాగధసంశ్రయః॥ 2
తే పీడితా నివివిశుః కురుపాంచాలకేకయాన్
శాల్వాన్విదర్భాన్నిషధాన్విదేహాన్కోసలానపి॥ 3
ఏకే తమనురున్ధానా జ్ఞాతయః పర్యుపాసతే
హతేషు షట్సు బాలేషు దేవక్యా ఔగ్రసేనినా॥ 4



అనంతర కథా వృత్తాంతాన్ని శుకుడు పరీక్షిన్మహారాజుతో యిలా చెప్పసాగాడు— రాజా! బలశాలియగు కంసుడు జరాసంధుని సహాయంతో ప్రలంబ బక చాణూర ముష్టిక తృణావర్త అఘాసుర అరిష్ట ద్వివిద పూతనా కేశి ధేనుక బాణ భౌమాసురాది దైత్య రాజులతో కలసి యాదవులను జయించి హింసించడం ఆరంభించాడు. కంస పీడితులైన యాదవులు కురు పాంచాల కేకయ సాళ్వ విదర్భ నిషధ విదేహ కోసలాది దేశాలకు వెళ్లి నివసించడం మొదలుపెట్టారు. అల్పసంఖ్యాకులైన యాదవులుమాత్రం కంసుని అనుసరిస్తూ అతని సేవలో ఉండిపోయారు. దేవకీ గర్భసంభవులైన ఆరుగురు బాలురను కంసుడు సంహరించాడు.

సప్తమో వైష్ణవం ధామ యమనన్తం ప్రచక్షతే
గర్భో బభూవ దేవక్యా హర్షశోకవివర్ధనః॥ 5
భగవానపి విశ్వాత్మా విదిత్వా కంసజం భయం
యదూనాం నిజనాథానాం యోగమాయాం సమా
దిశత్॥

గచ్ఛ దేవి వ్రజం భద్రే గోపగోభిరలంకృతం
రోహిణీ వసుదేవస్య భార్యాస్తే నందగోకులే
అన్యాశ్చ కంససంవిగ్నా వివరేషు వసంతి హి॥ 7
దేవక్యా జఠరే గర్భం శేషాఖ్యం ధామ మామకం
తత్సన్నికృష్య రోహిణ్యా ఉదరే సంనివేశయ॥ 8

---

దేవకి ఏడవసారి గర్భం ధరించింది. దేవకీదేవికి హర్షశోకాలను వృద్ధి చెందించే లాగున నారాయణ కాళాంశావతారమూర్తియగు అనంతుడైన శేషుడే దేవకీ గర్భంలో ప్రవేశించాడు

విశ్వాత్మయగు భగవానుడు తన కాశ్రియులైన యాదవులు కంసునివల్ల భయ భీతులై ఉండడం చూసి యోగమాయను పిలచి "కళ్యాణీ! నీవు గో గోప గోపికలతో కూడిన వ్రజభూమికి వెళ్ళు. వసుదేవుని భార్య రోహిణి గోకులంలో నందుని నగరంలో ఉంది. ఇంకా అన్యులైన స్త్రీలు కూడా కంసుని భయంవల్ల నంద గోకులంలో ఉన్నారు. వారంతా రహస్యస్థానాలలో గుప్తంగా ఉంటున్నారు. ఇప్పుడు నా సంబంధమైన తేజోమయ శేషాంశ

అథాహ మంశభాగేన దేవక్యాః పుత్రతాం శుభే
ప్రాప్స్యామి త్వం యశోదాయాం నందపత్న్యాం
భవిష్యసి॥ 9

అర్చిష్యన్తి మనుష్యాస్త్వాం సర్వకామవరేశ్వరీం
ధూపోపహారబలిభిః సర్వకామవరప్రదాం॥ 10
నామధేయాని కుర్వన్తి స్థానాని చ నరా భువి
దుర్గేతి భద్రకాళీతి విజయా వైష్ణవీతి చ॥ 11
కుముదా చండికా కృష్ణా మాధవి కన్యకేతి చ
మాయా నారాయణీశానీ శారదేత్యంబికేతి చ॥ 12

---

దేవకీ గర్భమందు ప్రవేసించి ఉన్నది. నీ వా గర్భగతమైన పిండాన్ని గ్రహించి రోహిణీ గర్భంలో ప్రవేశపెట్టు. నేను జ్ఞాన బలాదులతో పరిపూర్ణ అంశలతో దేవకియందు అవతరిస్తాను. నీవు అదే సమయానికి నందపత్ని యగు యశోద యందు కన్యారూపంలో అవతరించు. నీవు సమస్త కోరికలనూ ప్రసాదించే దానవు కాగలవు. మానవులందరూ వారి కోర్కెలు సిద్ధింప చేసుకోడానికి ధూప దీప ఉపహారాలతో నిన్ను పూజిస్తారు. మనుష్యులు నీకు అనేక ఆలయాలు కట్టించి అనేక నామాలతో పిలుస్తూ ఉంటారు. దుర్గా భద్రకాళీ విజయా వైష్ణవీ కుముదా చండికా కృష్ణా మాధవీ కన్యకా మాయా నారాయణీ ఈశానీ శారదా అంబికా మొదలుగా గల అనేక నామములతో నీవు ప్రసిద్ధి చెందుతావు.'' అని ఆదేశం ఇచ్చాడు. గర్భంయొక్క

గర్భసంకర్షణాత్తం వై ప్రాహుః సంకర్షణం భువి
రామేతి లోకరమణాద్బలం బలవదుచ్ఛ్రయాత్॥ 13
సందిష్టైవం భగవతా తథేత్యోమితి తద్వచః
ప్రతిగృహ్య పరిక్రమ్య గాం గతా తత్తథాకరోత్॥ 14
గర్భే ప్రణీతే దేవక్యా రోహిణీం యోగనిద్రయా
అహో విస్రంసితో గర్భ ఇతి పౌరా విచుక్రుశుః॥ 15
భగవానపి విశ్వాత్మా భక్తానామభయంకరః
ఆవివేశాంశభాగేన మన ఆనకదుందుభేః॥ 16
స బిభ్రత్పౌరుషం ధామ భ్రాజమానో యథా రవిః
దురాసదోఽతిదుర్ధర్షో భూతానాం సంబభూవ హ॥ 17

---

ఆకర్షణ చెయ్యడంవల్ల ఆ బాలుడు సంకర్షణుడనీ లోక రంజకుడగుటవల్ల రాముడనీ బలవంతులలో శ్రేష్ఠుడవుట వల్ల బలరాముడూ బలభద్రుడూ అనీ ప్రసిద్ధి వహిస్తాడు— అని భగవానుడు పలికాడు.

పరమపురుషుని ఆజ్ఞను శిరసా వహించి యోగమాయ శ్రీహరికి ప్రదక్షిణనమస్కారాలుచేసి భూలోకానికి వచ్చి దేవకీగర్భంలో ఉన్న పిండాన్ని గ్రహించి రోహిణీ గర్భంలో ప్రవేశ పెట్టింది. వెంటనే పురవాసులంతా దేవకీ గర్భం విచ్ఛిన్నమై పోయిందని విచారించారు. తరువాత భక్తుల భయాన్ని హరించే వాసుదేవుడు తన సంపూర్ణ కళలతో వసుదేవుని అంతఃకరణ యందు ప్రవేశించాడు. అప్పుడు వసుదేవుడు సూర్యసమాన తేజంతో ప్రకాశించేడు.

తతో జగన్మంగళమచ్యుతాంశం
సమాహితం శూరసుతేన దేవీ
దధార సర్వాత్మకమాత్మభూతం
కాష్ఠా యథానందకరం మనస్తః॥ 18

సా దేవకీ సర్వజగన్నివాస
నివాసభూతా నితరాం న రేజే
భోజేంద్రగేహేఽగ్నిశిఖేవ రుద్ధా
సరస్వతీ జ్ఞానఖలే యథా సతీ॥ 19

తాం వీక్ష్య కంసః ప్రభయాజితాంతరాం
విరోచయన్తీం భవనం శుచిస్మితాం

---

ఆతని తేజస్సును మానవులు చూడలేక పోతున్నారు. జగన్మంగళకరుడూ ఆత్మస్వరూపుడూ అయిన అచ్యుతుని ఆ దివ్యతేజాన్ని వసుదేవునిద్వారా ప్రవేశపెట్టి నప్పుడు దేవకీదేవి నిర్మల హృదయంతో పూర్వదిశ చంద్రుని ధరించినట్లు తేజోరూపమైన గర్భాన్ని ధరించింది. సమస్త జగదాశ్రయభూతుడైన భగవానునకు ఆశ్రయురాలై ఉండీ కూడ దేవకి పరిపూర్ణ శోభను పొందలేదు. ఘటంచే కప్పబడిన దీపము వలెనూ జ్ఞానవంచకునియొక్క అంతఃకరణయందున్న సద్విద్య వలెనూ కంసుని కారాగారంలో బంధింపబడిఉండుటవల్ల దేవకి శోభించడం లేదు.

అజేయుడగు భగవంతుడు గర్భంలో ఉండడంవల్ల దేవకీదేవి తన దివ్యకాంతిచే కారాగారమంతా ప్రకాశింప

అహ్యైష మే ప్రాణహరో హరిర్గుహాం
ధ్రువం శ్రితో యన్న పురేయమీదృశీ॥ 20

కిమద్య తస్మిన్కరణీయమాశు మే
యదర్థతంత్రో న విహన్తి విక్రమమ్
స్త్రియాః స్వసుర్గురుమత్యా వధోఽయం
యశః శ్రియం హన్త్యనుకాలమాయుః॥ 21

స ఏష జీవన్ఖలు సమ్పరేతో
వర్తేత యోఽత్యన్తనృశంసితేన
దేహే మృతే తం మనుజాః శపన్తి
గన్తా తమోఽన్ధం తనుమానినోధ్రువం॥ 22

---

చేస్తోంది. ఆ అలౌకిక తేజోరాసిని చూసి కంసుడు తనలో తాను ఇలా ఆలోచించ సాగాడు. ఇప్పుడు దేవకి ఎనిమిదవ గర్భం దాల్చింది. నాకు మారకుడైన శ్రీహరి ఈమె గర్భంలో ప్రవేశించడం వల్లనే గతంలో ఎప్పుడూ లేని తేజంతో ఈమె ఇప్పుడు ప్రకాశిస్తోంది. ఈ హరిని నాశనంచేసే ఉపాయం నేను ఆలోచించాలి. వీరుడైనవాడు స్వార్థపరుడై తన పరాక్రమాన్ని కలుషితం చేసుకోకూడదు. ఇప్పుడు నేను దేవకిని సంహరించి స్త్రీహత్యాపాతకం పొందటం న్యాయంగాదు. అందులో చెల్లెలు. గర్భిణివధా రూపమైన పాపంకూడా నన్నంటుతుంది. ఆవెంటనే నా యశస్సు ఆయుష్యం ఐశ్వర్యం నశించిపోతాయి. నిత్యం హింసావృత్తితో జీవించేవాడు జీవచ్ఛవంతో సమానుడు.

ఇతి ఘోరతమాద్భావాత్సన్నివృత్తః స్వయం ప్రభుః
ఆస్తే ప్రతీక్షం స్తజ్జన్మ హరేర్వైరానుబంధకృత్॥ 23
ఆసీనః సంవిశం స్తిష్ఠన్భుంజానః పర్యటన్ మహీం
చిన్తయానో హృషీకేశమపశ్యత్తన్మయం జగత్॥ 24
బ్రహ్మా భవశ్చ తత్రైత్య మునిభిర్నారదాదిభిః
దేవైః సానుచరైః సాకం గీర్భిర్వృషణమైడయన్॥ 25
సత్యవ్రతం సత్యపరం త్రిసత్యం
సత్యస్య యోనిం నిహితం చ సత్యే
సత్యస్య సత్యమృతసత్యనేత్రం
సత్యాత్మకం త్వాం శరణం ప్రపన్నాః॥ 26

---

మరణానంతరం వానిని ప్రజలు నిందిస్తారు. అంతేగాక వాడు దేహాభిమానులుపొందే తమోమయ లోకాలు పొందుతాడు-"అని కంసుడు ఆలోచించి సమర్థత కలవాడై యుండీ దేవకీ వధా రూపమైన భయంకర ప్రయత్నం విరమించాడు. భగవానునిపై వైరంపూని ఆయన జననకాలం కొరకు నిరీక్షిస్తూ లేచునప్పుడు కూర్చున్నప్పుడూ నడుస్తూ తింటూ తిరుగుతూ త్రాగుతూఉన్నప్పుడూ కూడ శ్రీహరిచింతన యందే మనస్సు లగ్నంచేశాడు కంసుడు. ఏకాగ్రతలో కంసునకు జగత్తు అంతా శ్రీహరిమయంగా కనపడుతూంది.

ఆసమయంలోనే చతుర్ముఖుడు నారదాది ఋషులనూ ఇంద్రాది దేవతలనూ సదాశివునీ వెంటబెట్టుకొని

ఏకాయనోఽసౌ ద్విఫలస్త్రిమూల
శ్చతూరసః పంచవిధః షడాత్మా
సప్తత్వగష్టవిటపో నవాక్షో
దశచ్ఛదీ ద్విఖగో హ్యాదివృక్షః॥ 27
త్వమేక ఏవాస్య సతః ప్రసూతి
స్త్వం సన్నిధానం త్వమనుగ్రహశ్చ
త్వన్మాయయా సంవృతచేతసస్త్వాం
పశ్యన్తి నానా న విపశ్చితో యే॥ 28

---

దేవకీదేవి వసిస్తూఉన్న కారాగారంలో ప్రవేశించి శ్రీహరిని యిలా స్తుతి చేయడం ఆరంభించాడు.

శ్రీహరీ! నీవు సత్యసంకల్పుడవు. సత్యమే నీ ప్రాప్తికి ప్రధాన సాధనం. నీవు త్రికాలాలలోనూ సత్యంగా ఉండే వాడవు. సత్యానికి ఆదికారణం నువ్వే. (అంటే యీ కనపడే జగత్తుకు అంతమూ కారణుడవు నువ్వే.) నువ్వు సత్యమందే ఉంటావు. సత్యానికే నీవు సత్యం. ఋతసత్యాలు నీకు నేత్రాలు. "ఋతం చ సూనృతా వాణీ సత్యం చ సమదర్శనం" అనే ఆర్ష సిద్ధాంతాన్ని అనుసరించి సుందరంగా మధురంగా హితంగా ఉండే ప్రియ వాక్కునే ఋతమని అంటారు. సమదర్శనం సత్యమనబడుతుంది. సత్యస్వరూప! మేము నిన్ను శరణంటున్నాం. ఈ సంసార రూపమైన సనాతన వృక్షానికి ప్రకృతి ఒక్కటే ఆశ్రయం. సుఖ దుఃఖాలు రెండూ ఫలాలు. సత్వ రజ స్తమో గుణాలు

బిభర్షి రూపాణ్యవబోధ ఆత్మా
క్షేమాయ లోకస్య చరాచరస్య
సత్త్వోపపన్నాని సుఖావహాని
సతామభద్రాణి ముహుః ఖలానామ్॥ 29

త్వయ్యమ్బుజాక్షాఖిలసత్త్వధామ్ని
సమాధినావేశితచేతసైకే
త్వత్పాదపోతేన మహత్కృతేన
కుర్వన్తి గోవత్సపదం భవాబ్ధిమ్॥ 30

---

మూడూ మూలం. ధర్మ అర్థ కామ మోక్షాలు రసాలు. త్వక్ చక్షు శ్రోత్ర జిహ్వా ఆఘ్రాణములు అనే జ్ఞానేంద్రియ పంచకం తెలుసుకోడానికి సాధనాలు. శోకం మోహం జరా మృత్యువు క్షుత్తు పిపాసలు ఆరూ దీని స్వభావాలు. రసం రక్తం మాంసం మేదస్సు అస్థి మజ్జా శుక్రాలు దీనికి చర్మభూతమైనవి. పంచ భూతాలూ మనస్సూ బుద్ధీ అహంకారమూ యీ వృక్షానికి ఎనిమిది కొమ్మలు. నేత్ర కర్ణ నాసికా ద్వారాలు ఆరూ, నోరూ మల మూత్ర ద్వారాలు మూడూ, ఈ మొత్తం తొమ్మిదీ ఆ వృక్షానికి ఛిద్రాలు. ప్రాణ అపాన వ్యాన ఉదాన సమాన నాగ కూర్మ కృకర దేవదత్త ధనంజయము లనే దశ ప్రాణాలూ యీ వృక్షానికి ఆకులు. ఆ వృక్షంమీద జీవాత్మ పరమాత్మలు అనే పక్షులు రెండూ నివసిస్తూ ఉంటాయి. ఈ సంసార వృక్షానికి శ్రీహరి ఒక్కడే ఉత్పత్తి

స్వయం సముత్తీర్య సుదుస్తరం ద్యుమన్
భవార్ణవం భీమమదభ్రసౌహృదాః
భవత్పదాంభోరుహనావమత్ర తే
నిధాయ యాతాః సదనుగ్రహోభవాన్. 31

యేఽన్యేఽరవిన్దాక్ష విముక్తమానిన
స్త్వయ్యస్తభావాదవిశుద్ధబుద్ధయః
ఆరుహ్య కృచ్ఛ్రేణ పరం పదం తతః
పతన్త్యధోఽనాదృతయుష్మదంఘ్రయః॥ 32

---

స్థానం నువ్వే దీనికి అధిష్ఠానం. పాలకుడవు కూడా నువ్వే. నీ మాయచేత మోహితులైనవారే నిన్ను అనేకరూపాలలో చూస్తూ ఉంటారు. తత్త్వజ్ఞానులు అయిన విద్వాంసులు మాత్రం స్వజాతీయ విజాతీయ స్వగత భేదశూన్యమైన పరమాత్మగా నిన్ను గ్రహించి, నీలోనే ఐక్యమై, నిరతిశయ ఆనందాన్ని అనుభవిస్తారు. నువ్వు జ్ఞాన స్వరూపుడవు. సమస్త చరాచర ప్రపంచ కళ్యాణంకొరకు విశుద్ధ సత్వ మయ రూపాలు అనేకం ధరిస్తూ ఉంటావు. ఆ రూపాలు సత్పురుషులకు ఆనందాన్నీ దుర్మార్గులకు దుఃఖాన్నీ కలుగ చేస్తాయి.

కమలనయనా! కొందరు పురుషులు సమాధి ద్వారా వారి చిత్తాలను నీ సత్త్వస్వరూపంలో లగ్నంచేసి మహా పురుష సేవితమైన నీ చరణకమలాలు అనే నౌకను ఆశ్ర యించి యీ సంసారసముద్రాన్ని గోపాదంతో సమానంగా

తథా న తే మాధవ తావకాః క్వచి
ద్భ్రశ్యన్తి మార్గాత్త్వయి బద్ధసౌహృదాః
త్వయాభిగుప్తా విచరన్తి నిర్భయా
వినాయకానీకపమూర్ధసు ప్రభో॥ 33
సత్త్వం విశుద్ధం శ్రయతే భవాన్స్థితౌ
శరీరిణాం శ్రేయఉపాయనం వపుః
వేదక్రియాయోగతపఃసమాధిభి
స్తవార్హణం యేన జనః సమీహతే॥ 34

---

దాటకలుగుతున్నారు. స్వయంప్రకాశరూపా! సజ్జనులను కరుణించడం నీకు స్వభావం. నీయందు పరమప్రేమరూపమైన భక్తికలవారు అపారం అగాధం అయిన యీ సంసార సముద్రం దాటి యితర మానవులను తరింపచేయడానికి నీ చరణకమలరూపమైన నావను ఇక్కడే వదలి వెళ్ళిపోతున్నారు. అంటే వారు ఏ భక్తిమార్గంతో తరించారో ఆ భక్తిమార్గాన్నే ఉపదేశం చేసి వెళ్ళిపోతున్నారు. కమలాక్ష! నీయందు భక్తిలేక యితర కర్మలు ఆచరించే వారు ముక్తి కలుగుతుందని అనుకుంటారు. కాని నీయందు భక్తిలేకపోవటంవల్ల వారికి చిత్తశుద్ధి కలగటంలేదు. అతి వ్యయప్రయాస సాధ్యమైన కర్మలు చేసి ఆ కర్మఫలాన్ని అనుభవించటానికి స్వర్గాది లోకాలనుపొంది ఆ ఫలం అనుభవించిన తరువాత తిరిగి భూమండలంలో జన్మిస్తున్నారు. కాని నీయందు భక్తికలిగిఉండే భక్తులు మాత్రం అజ్ఞానుల

సత్త్వం న చేద్ధాతరిదం నిజం భవే
ద్విజ్ఞానమజ్ఞానభిదాపమార్జనం
గుణప్రకాశైరనుమీయతే భవాన్
ప్రకాశతే యస్య చ యేన వా గుణః॥ 35

న నామరూపే గుణజన్మకర్మభి
ర్నిరూపితవ్యే తవ తస్య సాక్షిణః
మనోవచోభ్యామనుమేయవర్త్మనో
దేవ క్రియాయాం ప్రతియన్త్యథాపి హి॥ 36

---

వలె సన్మార్గభ్రష్టులు అవరు. భక్తులు నీచే సర్వదా రక్షింపబడుతూ ఉంటారు. అందుచేత విఘ్నాలు అనే సైన్యాలను నడిపించే సైన్యాధిపతుల శిరస్సులను కాలదన్ని సర్వవిఘ్నాలను యెదుర్కొని నిర్భయంగా శాంతచిత్తంతో చరిస్తారు. పరమేశా! ఈ సంసార సముద్రంనుండి మానవులను ఉద్ధరించడానికి నువ్వు విశుద్ధసత్త్వాన్ని ఆశ్రయించి ఉత్తమగతిని ప్రసాదించటానికి దివ్యమంగళస్వరూపాలు ధరిస్తున్నావు. ఆరూపాలనే ఆధారం చేసుకొని మానవులు జ్ఞాన క్రియా తపస్సమాధుల ద్వారా నిన్ను పూజలు చేస్తున్నారు. నారాయణా! నువ్వు ఈ శుద్ధసత్త్వమయ రూపాన్ని ధరించకపోతే అజ్ఞానుల భేదభావం నశింపచేసే నీ అపరోక్ష జ్ఞానం పొందడానికి అవకాశంలేదు. యెందుచేత అంటే యీ గుణాలు యెవరిసంబంధమైనవో ఎవరివల్ల ప్రకాశిస్తున్నాయో అని శంకిస్తారు. గుణప్రకాశం చేతనే

శృణ్వన్ గృణన్ సంస్మరయంశ్చ చిన్తయన్
నామాని రూపాణి చ మంగళాని తే
క్రియాసు యస్త్వచ్చరణారవిన్దయో
రావిష్టచేతా న భవాయ కల్పతే॥ 37
దిష్ట్యా హరేఽస్యా భవతః పదో భువో
భారోఽపనీతస్తవ జన్మ! నేశితుః
దిష్ట్యాంకితాం త్వత్పదకైః సుశోభనై
ర్ద్రక్ష్యామ గాం ద్యాం చ తవానుకంపితామ్॥

నిన్ను సర్వ అధిష్ఠాన సర్వసాక్షీభూతుడవైన పరమాత్మగా అనుమానించడానికి అవకాశం కలుగుతోంది. అలాగే అనుమానంచేత సిద్ధాంతం చేసుకుంటున్నారు. అలాంటి జ్ఞానం వల్ల అజ్ఞానం కొట్టబడుతోంది. దేవ దేవ! మనస్సూ వేదవాణీ ఎవని స్వరూపస్వభావాలు నిర్ణయించలేకపోతున్నాయో అలాంటి నీ రూపం గుణం కర్మ జ్ఞానం మొదలైనవాటిని వర్ణించడం చాలాకష్టం. ఐనా నీ భక్తులు ఉపాసనాది క్రియాయోగాలద్వారా నీ సాక్షాత్కారం పొందుతూనే ఉన్నారు. ఏ మానవులు నీ చరణకమలాలపై మనస్సు లగ్నంచేసి లౌకిక వైదిక క్రియలు చేసే సమయాలలోకూడా శుభావహమైన నీ నామ రూప గుణాలను శ్రవణ కీర్తన స్మరణ ధ్యానాలద్వారా నిన్ను సేవించుతూ ఉంటారో, వారు తిరిగి సంసార లంపటులు కారు. వారికి తిరిగి పుట్టుకే ఉండదు. సర్వశక్తి సంపన్నుడవైన నీవు యీ భూమిపై

న తేఽభవస్యేశ భవస్య కారణం
వినా వినోదం బత తర్కయామహే
భవో నిరోధః స్థితిరప్యవిద్యయా
కృతా యతస్త్వయ్యభయాశ్రయాత్మని॥ 39
మత్స్యాశ్వకచ్ఛపనృశింహవరాహహంస
రాజన్యవిప్రవిబుధేషు కృతావతారః
త్వం పాసి నస్త్రిభువనం చ యథాధునేశ
భారం భువో హర యదూత్తమ వన్దనం తే॥

---

అవతరించటంవల్ల నీ పాదరూపమైన యీభూమికి భారం నశించుతుంది. ఏమి మహాభాగ్యం మాది! నీ చరణాంకిత మైన భూమినీ నీకృపారసదృష్టిప్రసరించే స్వర్గాన్ని చూడడం వల్ల మేమంతా ధన్యులం అయ్యాం. జగదీశ్వరా! నీవు జననం లేనివాడవై ఉండి ఈ లీలాగృహీత శరీరంతో అవత రించడం నీ వినోదంకొరకే అయివుంటుంది. లేకపోతే మరో కారణం ఏదీ కనిపించదు. నిర్భయుడవూ సర్వఅధిష్ఠానమూ ఐన నీయందు ఈ సృష్టి స్థితి లయాలు అవిద్యాకృతంగానే జరుగుతూ ఉంటాయి. యదుశ్రేష్ఠ! ఇలాగే పూర్వ కాలంలో మత్స్య కూర్మ హయగ్రీవ వరాహ నృసింహ హంస క్షత్రియ బ్రాహ్మణ దేవతారూపాలలో అవతరించి మమ్మల్నీ ముల్లోకాల్నీ కూడా రక్షించావు. అదేవిధంగా ఇప్పుడుకూడా అవతరించి భూభారం హరించు"— అని దేవకీగర్భస్థుడైన శ్రీహరిని స్తుతిచేసి దేవకీదేవితో "తల్లీ!

దిష్ట్యామ్బ తే కుక్షిగతః పరః పుమా
నంశేన సాక్షాద్భగవాన్భవాయ నః
నాభూద్భయం భోజపతేర్ముమూర్షో
ర్గోప్తా యదూనాం భవితా తవాత్మజః॥ 41

శ్రీశుక ఉవాచ.

ఇత్యభిష్టూయ పురుషం యద్రూపమనిదం యథా
బ్రహ్మేశానౌ పురోధాయ దేవాః ప్రతియయుర్దివమ్॥ 42

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే
గర్భగతవిష్ణోర్బ్రహ్మాదికృతస్తుతిర్నామ
ద్వితీయోఽధ్యాయః

---

నీవు మహాభాగ్యశాలినివి. మాకందరకూ అభ్యుదయం ప్రసాదించే శ్రీహరి నీ గర్భంలో సమస్త కళాయుక్తుడై ప్రవేశించి ప్రకాశిస్తున్నాడు. మాతా! మరణం ఆసన్నమైన కంసునకు నీవు ఇంక భయపడనక్కరలేదు. నీ పుత్రుడు యదుకుల రక్షకుడు ఔతాడు"—— అని బ్రహ్మాది దేవతలు దేవకితో పలికి దృశ్యప్రపంచంకంటె భిన్నమైన శ్రీహరిని వేనోళ్ళ స్తుతిచేసి అనంతరం వారి వారి లోకాలకు వెళ్ళిపోయారు—— అని శుకమహర్షి చెప్పి ఒక్క ముహూర్తకాలం హరిధ్యానంలో ఉండిపోయాడు.

ఇది ద్వితీయాధ్యాయం.



# తృతీయాధ్యాయము

శ్రీశుక ఉవాచ.

అథ సర్వగుణోపేతః కాలః పరమశోభనః
యర్హ్యేవాజనజన్మర్క్షం శాంతర్క్షగ్రహతారకమ్॥ 1
దిశః ప్రసేదుర్గగనం నిర్మలోడుగణోదయమ్
మహీ మంగళభూయిష్ఠపురగ్రామవ్రజాకరా॥ 2
నద్యః ప్రసన్నసలిలా హ్రదా జలరుహశ్రియః
ద్విజాలికులసంనాదస్తబకా వనరాజయః॥ 3
వవౌ వాయుః సుఖస్పర్శః పుణ్యగంధవహః శుచిః
అగ్నయశ్చ ద్విజాతీనాం శాంతాస్తత్ర సమింధత॥ 4

---

తన్మయచిత్తంతో శుకమహర్షి శ్రీకృష్ణజనన వృత్తాంతాన్ని పరీక్షిన్నరేంద్రునికి ఇలా చెప్పటం ఆరంభించాడు. రాజా! మంగళప్రదమై సర్వసుగుణయుక్తమైన సమయం రాగానే బ్రహ్మనక్షత్రమైన రోహిణి ఉదయించడంతో అశ్విని మొదలగు నక్షత్రాలూ, సర్వగ్రహాలూ శాంతంగా ఉన్నాయి. దశదిశలూ నిర్మలంగా ఉన్నాయి. ఆకాశంలో తారాగణం ఉజ్జ్వల కాంతులతో ప్రకాశిస్తోంది. పుర గ్రామ గోష్ఠ రత్నాగారాలు మంగళమయంగా ఉన్నాయి. నిర్మలమైన ఉదకాలతో నదులు ప్రవహిస్తున్నాయి కమలాలు వికసించడంవల్ల సరోవరాల శోభ వృద్ధిచెందింది. వనాలూ ఉపవనాలూ పక్షుల కిలకిలారావాలతో తుమ్మెదల ఝుంకార ధ్వనులతో వికసిత పుష్పసుగంధాలతో నూతన శోభావహం

మనాంస్యాసన్ప్రసన్నాని సాధూనామసురద్రుహామ్
జాయమానేఽజనే తస్మిన్నేదుర్దున్దుభయో దివి॥ 5
జగుః కిన్నరగన్ధర్వాస్తుష్టువుః సిద్ధచారణాః
విద్యాధర్యశ్చ ననృతురప్సరోభిః సమం తదా॥ 6
ముముచుర్మునయో దేవాః సుమనాంసి ముదాన్వితాః
మన్దం మన్దం జలధరా జగర్జురనుసాగరం॥ 7
నిశీథే తమఉద్భూతే జాయమానే జనార్దనే
దేవక్యాం దేవరూపిణ్యాం విష్ణుః సర్వగుహాశయః
ఆవిరాసీద్యథా ప్రాచ్యాం దిశీన్దురివ పుష్కలః॥ 8

---

పరలతో ఆనందం కలిగిస్తున్నాయి. మలయ మందమారుతం వీస్తోంది. అగ్నిహోత్రశాలలలో అగ్నులు శాంతంగా తమంత తాము ప్రజ్వలిస్తున్నాయి. దేవతలకూ సత్పురుషులకూ హృదయవికాసం కలిగింది. ఆకాశంలో దేవదుందుభులు మ్రోగుతున్నాయి. కిన్నరులూ గంధర్వులూ గానం చేస్తున్నారు. సిద్ధులూ చారణులూ స్తుతి చేస్తున్నారు. అప్సరలూ విద్యాధరులూ నృత్యం ఆరంభించారు. ఋషులూ దేవతలూ పుష్పవృష్టి కురిపిస్తున్నారు. రత్నాకరుడూ మేఘాలూ శుభసూచకంగా గర్జించడం మొదలుపెట్టాయి. తూర్పు దిక్కున పూర్ణచంద్రుడు ఉదయించినట్లు జననరహితుడైన భగవానుడు సత్పురుషులకు హృదయవికాసం కలుగుతుండగా దేవతాస్వరూపిణి యైన దేవకీగర్భంనుండి సర్వాంతర్యామి యగు శ్రీహరి ఉదయించాడు.

తమద్భుతం బాలకమంబుజేక్షణం
చతుర్భుజం శంఖగదార్యుదాయుధం
శ్రీవత్సలక్ష్మం గళశోభికౌస్తుభం
పీతాంబరం సాంద్రపయోదసౌభగమ్॥ 9
మహార్హవైడూర్యకిరీటకుండల
త్విషా పరిష్వక్తసహస్రకుంతలం
ఉద్దామకాఞ్చ్యఙ్గదకఙ్కణాదిభి
ర్విరోచమానం వసుదేవ ఐక్షత॥ 10
స విస్మయోత్ఫుల్లవిలోచనో హరిం
సుతం విలోక్యానకదున్దుభిస్తదా

కమలదళ సదృశ నేత్రాలు, శంఖ చక్ర గదా పద్మాలతో ప్రకాశించు నాలుగు భుజాలు, శ్రీవత్సాంకితమైన విశాలవక్షస్థలం, కౌస్తుభాలంకృతమైన శంఖం వంటి కంఠం తొలకరిమేఘంతో సమానమైన దేహకాంతితో, అరుణకాంతులను అధఃకరించు పీతాంబరమును ధరించిన శ్యామసుందరమూర్తియగు అద్భుతమైన బాలుని చూచాడు వసుదేవుడు. తుమ్మెదరెక్కలను ధిక్కరించు అలకావళి అమూల్యరత్నకిరీటం మకరకుండల కాంతులతో కనులు మిరుమిట్లు గొల్పుతూంది. ఆ శ్యామసుందరాంగుని కటిప్రదేశం రత్నఖచిత మేఖలంచే ఆవృతమై ఉంది. అంగద కేయూర నూపురాది భూషణభూషితమైన శ్రీహరి ఆ సమయంలో పురుషరూపంలో అవతరించడం చూసిన వసుదేవుని

కృష్ణావతారోత్సవసమ్భ్రమోఽస్పృశ
న్ముదా ద్విజేభ్యోఽయుతమాప్లుతో గవామ్॥
అథైనమస్తౌదవధార్య పూరుషం
పరం నతాఙ్గః కృతధీః కృతాఞ్జలిః
స్వరోచిషా భారత సూతికాగృహం
విరోచయన్తం గతభీః ప్రభావవిత్॥ 12

వసుదేవ ఉవాచ.

విదితోఽసి భవాన్సాక్షాత్పురుషః ప్రకృతేః పరః
కేవలానుభవానన్దస్వరూపః సర్వబుద్ధిదృక్॥ 13

---

నేత్రాలు వికసించాయి. కృష్ణావతార మహోత్సవసమయంలో వసుదేవుడు అత్యానందంపొంది బ్రాహ్మణులకు పదివేల గోవులను ఇచ్చుటకు సంకల్పంచేశాడు. ఆ సూతికాగారంలో దశదిశలనూ ప్రకాశింపచేయు ఆ బాలుడు సాక్షాత్తూ శ్రీపరమపురుషుడే అని గ్రహించిన వసుదేవుడు, శ్రీహరి ప్రభావం తెలసినవాడగుటచే భయరహితుడై శిరస్సువంచి చేతులుజోడించి చతుర్భుజరూపుడైన నారాయణుని ఇలా స్తుతిచేయడం మొదలుపెట్టాడు.

“శ్రీహరీ! పరమపురుష! నీవు ప్రకృతికంటె పరమైనవాడవు అని నేను గ్రహించాను. నీవు విశుద్ధమైన జ్ఞానానందస్వరూపుడవు. సమస్తబుద్ధులకు సాక్షివి. ఆదియందు త్రిగుణరూపమైన యీ ప్రపంచాన్ని నీవే సృష్టించి, దీనియందు నీవు ప్రవేశించక, ప్రవేశించినవానివలె కనపడు

స ఏవ స్వప్రకృత్యేదం సృష్ట్వాగ్రే త్రిగుణాత్మకం
తదను త్వం హ్యప్రవిష్టః ప్రవిష్ట ఇవ భావ్యసే॥ 14
యథేమేఽవికృతా భావా స్తథా తే వికృతైః సహ
నానావీర్యాః పృథగ్భూతా విరాజం జనయన్తి హి॥ 15
సన్నిపత్య సముత్పాద్య దృశ్యన్తేఽనుగతా ఇవ
ప్రాగేవ విద్యమానత్వాన్న తేషా మిహ సమ్భవః॥ 16
ఏవం భవాన్బుద్ధ్యనుమేయలక్షణై
ర్గ్రాహ్యైర్గుణైః సన్నపి తద్గుణాగ్రహః
అనావృతత్వాద్బహిరన్తరం న తే
సర్వస్య సర్వాత్మన ఆత్మవస్తునః॥ 17

---

తున్నావు. మహత్తత్త్వాదులు వేరు వేరుగా ఉన్నంత వరకూ అవి భిన్నభిన్నశక్తులు కలిగి ఉండటంచేత విశిష్టమైన ఏ కార్యం చేయలేకపోతున్నాయి. అవికూడా ఇంద్రియాది షోడశ వికారములవలె అన్యోన్యం కలసినట్లైతే బ్రహ్మాండ రచనకు సమర్థత కలిగి బ్రహ్మాండాలను సృజిస్తాయి. ఆ బ్రహ్మాండమందు అనుప్రవిష్టమైనట్లు కనిపిస్తున్నాయే కాని వాస్తవంగా వాటికి జన్మ కలగడంలేదు. అవి కారణ రూపంగా ఆదియందే ఉన్నాయి. ఇలాగ వేటియొక్క లక్షణాలు బుద్ధిచేత ఆలోచిస్తే అనుమానప్రమాణ సిద్ధములు అవుతున్నాయో, వేటిని ఇంద్రియాలద్వారా గ్రహించడానికి అవకాశం కలుగుతూఉందో, అట్టి గుణములయందు వ్యాప్తమైఉండీ కూడా ఆ గుణగ్రహణమాత్రంచే నిన్ను

య ఆత్మనో దృశ్యగుణేషు సన్నితి
వ్యవస్యతే స్వవ్యతిరేకతోఽబుధః
వినానువాదం న చ తన్మనీషితం
సమ్యగ్యతస్త్యక్తముపాదదత్పుమాన్॥ 18
త్వత్తోఽస్య జన్మస్థితిసంయమాన్విభో
వదన్త్యనీహాదగుణాదవిక్రియాత్
త్వయీశ్వరే బ్రహ్మణి నో విరుధ్యతే
త్వదాశ్రయత్వాదుపచర్యతే గుణైః॥ 19
స త్వం త్రిలోకస్థితయే స్వమాయయా
బిభర్షి శుక్లం ఖలు వర్ణమాత్మనః

---

గ్రహించే అవకాశం కలగడంలేదు. ఎందువల్లనంటే నిన్ను గుణాలు అంటవు. నీవు సర్వస్వరూపుడవు. సర్వాంతర్యామివి. ఆత్మస్వరూపుడవైన నీయందు బాహ్యాభ్యంతర భేదం లేదు. ఏ మానవుడు దృశ్యమైన దేహాదులు తనకంటె భిన్నములని గ్రహించి కూడా, దేహాదులయందు సత్యత్వ బుద్ధి కలవాడు అవుతాడో, అతడు మూర్ఖుడని పిలువబడతాడు. ఎందువల్లనంటే అట్టివాడు వాగ్విలాసంగా విచారణ సాగించాడేగాని ఆత్మానుభూతి పొందలేడు. కనుకనే విచారణవల్ల సత్యబాధకమైన విషయం గ్రహించీకూడా దేహాదులయందు సత్యభ్రాంతి కలవాడగుటచే అట్టివాడు వాచాజ్ఞానిగా మూఢుడుగా నిర్ణయింప బడతాడు. క్రియారహితుడవూ, నిర్వికారుడవూ, గుణాలులేనివాడవూఐన నీయందు

సత్త్వాయ రక్తం రజసోపబృంహితం
కృష్ణం చ వర్ణం తమసా జనాత్యయే॥ 20
త్వమస్య లోకస్య విభో రిరక్షిషు
ర్గృహేఽవతీర్ణోఽసి మమాఖిలేశ్వర
రాజన్యసంజ్ఞాసురకోటియూథపై
ర్నిర్వ్యూహ్యమానా నిహనిష్యసే చమూః॥
అయం త్వసభ్యస్తవ జన్మ నౌ గృహే
శ్రుత్వాగ్రజాంస్తే న్యవధీత్సురేశ్వర
స తేఽవతారం పురుషైః సమర్పితం
శ్రుత్వాధునైవాభిసరత్యుదాయుధః॥ 22

యీ సృష్టి స్థితి లయాలు జరుగుతాయి — అని వేదవేత్తలు పలుకుతారు. నిష్క్రియునియందు సృష్టి ఎలా కలుగుతుందని శంకించనక్కరలేదు. నీవు సర్వసమర్థతకల ఈశ్వరుడవు. సర్వ అధిష్ఠానమగు బ్రహ్మవు. త్రిగుణాలు నిన్నే ఆశ్రయించి ఉన్నాయి. కనుకనే వాటికార్యములైన సృష్టి స్థితి లయాలు నీయందు ఆరోపింపబడుతున్నాయి. నీ మాయ వల్ల త్రిలోకాలనూ రక్షించుటకుగాను సత్త్వమయమైన శుక్ల వర్ణమునూ, రజఃప్రధానమైన రక్తవర్ణమునూ, తమోగుణ ప్రధానమైన కృష్ణ వర్ణమునూ, ధరిస్తూ ఉంటావు. అఖిలేశ్వరా! ప్రభో! ఈసమయంలో ఈలోకాన్ని రక్షించుటకు ఇక్కడ అవతరించావు. రాజనామధారులైన అసురులు భూమండలమంతా వ్యాప్తి చెందిఉన్నారు, అట్టి భూభా

శ్రీశుక ఉవాచ.

అథైనమాత్మజం వీక్ష్య మహాపురుషలక్షణం
దేవకీ తముపాధావత్కంసాద్భీతా శుచిస్మితా॥ 23

దేవక్యువాచ.

రూపం యత్తత్ప్రాహురవ్యక్తమాద్యం
బ్రహ్మ జ్యోతిర్నిర్గుణం నిర్వికారం
సత్తామాత్రం నిర్విశేషం నిరీహం
స త్వం సాక్షాద్విష్ణురధ్యాత్మదీపః॥ 24

నష్టే లోకే ద్విపరార్ధావసానే
మహాభూతేష్వాదిభూతం గతేషు

---

రంగా ఉన్న రాక్షసుల నందరనూ సంహరిస్తావు. దేవదేవ! నీవు అవతరిస్తావని గ్రహించి దుష్టుడైన కంసుడు నీకు ముందు జనించిన వారినందరనూ సంహరించాడు. ఇప్పుడు నీవు అవతరించావు అని మాతలవల్ల విని ఖడ్గపాణియై పరువెత్తి కంసుడు వస్తాడు — అని పలికాడు వసుదేవుడు.

పరీక్షిన్మహారాజ! తన పుత్రునియందు నారాయణ లక్షణాలు చూసి దేవకీదేవి బ్రహ్మానందభరితురాలై యిలా స్తుతించడం ఆరంభించింది.

జగన్నాథ! వేదములయందు ఏ పరమార్థతత్త్వం ఆదికారణంగా చెప్పబడి ఉందో; అవ్యక్తమై బ్రహ్మజ్యోతిర్మయా నిర్వికార నిర్గుణ నిర్విశేష నిరీహ సత్తామాత్ర

వ్యక్తేఽవ్యక్తం కాలవేగేన యాతే
భవానేకః శిష్యతే శేషసంజ్ఞః॥ 25
యోఽయం కాల స్తస్య తేఽవ్యక్తబంధో
చేష్టామాహుశ్చేష్టతే యేన విశ్వమ్
నిమేషాదిర్వత్సరాన్తో మహీయాం
స్తం త్వేశానం క్షేమధామ ప్రపద్యే 26
మర్త్యో మృత్యుర్వ్యాళభీతః పలాయన్
లోకాన్సర్వాన్నిర్భయం నాధ్యగచ్ఛత్
త్వత్పాదాబ్జం ప్రాప్య యదృచ్ఛయాద్య
స్వస్థః శేతే మృత్యురస్మాదపైతి॥ 27

---

స్వరూపుడని వేదాలు ఎవరిని వర్ణించాయో, సర్వబుద్ధులనూ ప్రకాశింపజేయు సర్వసాక్షివైన ఆదివిష్ణువు నువ్వే.

(ఇక్కడ అవ్యక్తాది విశేషణాలచే ఉత్తరోత్తర పరమాణువు మొదలైన వానియొక్క కారణత్వాన్ని నిషేధించి సర్వకారణకారణంగా బ్రహ్మ పదార్థమే ప్రతిపాదన చేయబడింది. 'అవ్యక్త' మని చెప్పడంతో పరమాణువే బోధింప బడుతూఉంది. కనుకనే 'బ్రహ్మ' అంటే 'బృహత్' అని చెప్పబడింది. 'బ్రహ్మ' శబ్ధంచేత ప్రకృతి కూడా గ్రహింప బడుతుంది. కనక 'జ్యోతి' లేక 'చేతన' మని చెప్పబడింది. వైశేషిక మతావలంబుల అభిప్రాయంలో జ్ఞాన ఇచ్ఛా ప్రయత్నాది గుణములతో కూడిన ఆత్మకూడా చేతనమే అవడంవల్ల 'నిర్గుణ' మని చెప్పవలసి వచ్చింది.

స త్వం ఘోరాదుగ్రసేనాత్మజాన్నః
త్రాహి త్రస్తాన్భృత్యవిత్రాసహాసి
రూపం చేదం పౌరుషం ధ్యానధిష్ణ్యం
మా ప్రత్యక్షం మాంసదృశాం కృషీష్ఠాః॥
జన్మ తే మయ్యసౌ పాపో మా విద్యాన్మధుసూదన
సముద్విజే భవద్ధేతోః కంసాదహమధీరధీః॥ 29
ఉపసంహర విశ్వాత్మన్నదో రూపమలౌకికం
శంఖచక్రగదాపద్మశ్రియా జుష్టం చతుర్భుజం॥ 30
విశ్వం యదేతత్స్వతనౌ నిశాన్తే
యథావకాశం పురుషః పరో భవాన్

---

దీనివల్ల మీమాంసకులయొక్క జ్ఞానపరిణామమైన ‘ఆత్మ’ ద్యోతకం కావడంచేత ‘నిర్వికార’ మని నిరూపింపబడింది. కొందరు ‘ఆత్మను’ ‘నిర్వికార’ మని నమ్ముతూ శక్తుల ద్వారా పరిణామం పొందుతుందంటారు. అందుచేతనే ‘సత్తామాత్ర’మని చెప్పబడింది. నైయాయికుల ‘సామాన్యం’ కూడా ‘సత్తామాత్రమే’ గాని ప్రతిపక్షుల ‘విశేషం’ కారణంగా ‘నిర్విశేష’ మనబడింది. ‘నిర్విశేషమై’ కూడా జగత్కారణం కావడంవల్ల ‘బ్రహ్మ’ సక్రియుడు అవుతాడనే శంక కలుగుతూ ఉంది. కనుకనే బ్రహ్మయందు సక్రియతను నిషేధించుటకుగాను ‘నిరీహ’ మనే విశేషణం చూపబడింది).

బిభర్తి సోఽయం మమ గర్భగోఽభూ
దహో నృలోకస్య విడంబనం హి తత్ ॥ 31

శ్రీభగవానువాచ.

త్వమేవ పూర్వసర్గేఽభూః పృశ్నిః స్వాయంభువే సతి
తదాయం సుతపా నామ ప్రజాపతిరకల్మషః॥ 32
యువాం వై బ్రహ్మణాదిష్టౌ ప్రజాసర్గే యదా తతః
సన్నియమ్యేన్ద్రియగ్రామం తేపాథే పరమం తపః॥ 33
వర్ష వాతాతపహిమఘర్మకాలగుణానను
సహమానౌ శ్వాసరోధవినిర్ధూతమనోమలౌ॥ 34

---

ఏ సమయానికి బ్రహ్మయొక్క పరమాయుర్దాయంలో ద్వితీయపరార్థం సమాప్తం అవుతుందో అప్పుడు కాలవేగం చేత చరాచరప్రపంచమంతా నష్టమైపోతుంది. సమస్త భూతాలూ తమకు కారణమైన అహంకారంలో లీనం ఔతాయి. ఆసమయంలోనే అహంకారం మహత్తత్త్వం లోనూ మహత్తత్త్వం ప్రకృతియందూ, లీనంఔతాయి. ఆసమయంలో ఏకమాత్రుడవైన నీవు ఒక్కడవే శేషించి ఉంటావు. ప్రభో! ఎవని చేష్టచేత విశ్వం అంతా చేష్టలు కలదిగా ఔతుందో, నిమేషాది సంవత్సరపర్యంతమైన కాలం ఎవరి లీలా స్వరూపం అని చెపుతారో, జగత్తునకు అంతకూ ఈశ్వరుడవైనట్టియూ అభయస్థానమైనట్టియూ నిన్ను శరణు అంటున్నాను. సర్వేశ్వర! మరణధర్మం కల జీవి మృత్యురూపమైన కాలసర్పానికి భయపడి లోకాలన్నీ తిరిగి

శీర్ణపర్ణానిలాహారావుపశాన్తేన చేతసా
మత్తః కామానభీప్సన్తౌ మదారాధనమీహతుః 35
ఏవం వాం తప్యతోస్తీవ్రం తపః పరమదుష్కరం
దివ్యవర్షసహస్రాణి ద్వాదశేయుర్మదాత్మనోః॥ 36
తదా వాం పరితుష్టోఽహమమునా వపుషానఘే
తపసా శ్రద్ధయా నిత్యం భక్త్యా చ హృది భావితః। 37
ప్రాదురాసం వరదరాడ్ యువయోః కామదిత్సయా
వ్రియతాం వర ఇత్యుక్తే మాదృశో వాం వృతః సుతః॥
అజుష్టగ్రామ్యవిషయావనపత్యౌ చ దమ్పతీ
న వవ్రాథేఽపవర్గం మే మోహితౌ దేవమాయయా।

---

తిరిగి ఎక్కడా నిర్భయస్థానం లభించక నేటికి మహాభాగ్యవశం చేత నీ చరణాలను శరణుపొంది యీ సుఖనిద్రలో నిద్రిస్తూ ఉన్నది. ఇప్పుడు నీ అనుగ్రహంవల్ల మృత్యువు దూరమైపోయింది. జగన్నాథ! నీవు నీభక్తుల భయాన్ని హరించేవాడవు. కనుక యీదుష్టుడైన కంసుని భయాన్నుండి మమ్ము రక్షించు. మేము వీనివల్ల చాలా భయంచెంది ఉన్నాము. నారాయణా! ధ్యాన గోచరమగు భగవత్సంబంధమైన ఈ అలౌకికరూపాన్ని చర్మచక్షువులు కల యీ మానవుల ఎదుట ప్రకటించకు. మధుసూదన! నాగర్భంనుండి నీవు అవతరించిన సంగతి కంసునకు తెలియకుండా ఉండుగాక. నాకు చాలా అధైర్యంగా ఉంది. నిన్నుగురించి కూడా కంసునకు నేను భయపడుతూ ఉన్నాను. పరాత్పర! శంఖ

గతే మయి యువాం లబ్ధ్వా వరం మత్సదృశం సుతం
గ్రామ్యాన్భోగానభుంజాథాం యువాం ప్రాప్తమనోరథా॥
అదృష్ట్వాన్యతమం లోకే శీలౌదార్యగుణైః సమమ్
అహం సుతో వామభవం పృశ్నిగర్భ ఇతి శ్రుతః॥ 41
తయోర్వాం పునరేవాహమదిత్యామాస కశ్యపాత్
ఉపేన్ద్ర ఇతి విఖ్యాతో వామనత్వాచ్చ వామనః॥ 42
తృతీయేఽస్మిన్భవేఽహం వై తేనైవ వపుషాథ వామ్
జాతో భూయస్తయోరేవ సత్యం మే వ్యాహృతం సతి
ఏతద్వాం దర్శితం రూపం ప్రాగ్జన్మస్మరణాయ మే
నాన్యథా మద్భవం జ్ఞానం మర్త్యలింగేన జాయతే॥ 44

---

చక్ర గదా పద్మాలతో ఉన్న ఈ చతుర్భుజరూపం ఉపసంహరించు. ప్రళయకాలంలో ఈవిశ్వాన్ని అంతనూ నీశరీరంలో అవకాశం అనుసరించి ధరిస్తూ ఉంటావు. అట్టి పరమపురుషుడవైన నువ్వే నాగర్భంలో ప్రవేశించావు. యిది నీ అద్భుతమైన లీలమాత్రమే - అని దేవకి పలికింది.

( దేవకీదేవి పరమపురుషుని అలౌకిక రూపాన్ని ఉపసంహరింపమనియూ బాలగోపాలరూపంలో దర్శనం ఇవ్వమనియూ కోరుతూ ప్రళయకాల రూపం ఒక్కసారి స్మరించింది. ఆమె మనసా ఏరూపం ధ్యానించిందో సర్వజ్ఞుడైన భగవానుడు గ్రహించి ఆదేరూపంలో అవతరించాడు. ఆ దివ్యరూపాన్ని మార్కండేయ మహర్షి ఇలా ధ్యానించి స్తుతి చేశాడు. శ్లో॥ "కరారవిందేన పదారవిందం ముఖార

యువాం మాం పుత్రభావేన బ్రహ్మభావేన చాసకృత్
చిన్తయన్తౌ కృతస్నేహౌ యాస్యేథే మద్గతిం పరామ్॥
యది కంసాద్బిభేషి త్వం తర్హి మాం గోకులం నయ
మన్మాయామానయాశు త్వం యశోదాగర్భసమ్భవామ్॥
శ్రీశుక ఉవాచ.
ఇత్యుక్త్వాసీద్ధరిస్తూష్ణీం భగవానాత్మమాయయా
పిత్రోః సమ్పశ్యతోః సద్యో బభూవ ప్రాకృతః శిశుః॥

---

విందే వినివేశయంతం వటస్య పత్రస్య పుటే శయానం బాలం ముకుందం మనసా స్మరామి"— అటువంటి బాల ముకుంద రూపాన్ని వాత్సల్య భక్తితో ఉపాసించింది దేవకీ దేవి).

దేవకీవసుదేవుల స్తుతులకు ప్రసన్నుడై భగవానుడు ఇలా పలికాడు : దేవీ ! స్వాయంభువ మన్వంతరంలో నీవు పృశ్ని అనే పేరుకలదానవు. యీ వసుదేవుడు సుతపుడు అనే పేరుగల ప్రజాపతి. చతుర్ముఖుడు మిమ్ములను ప్రజావృద్ధి చేయమని ఆజ్ఞలు ఇచ్చాడు. అప్పటికే మీరు ఇద్దరూ ఇంద్రియాలను జయించి వాయు వర్ష శీత ఆతపాది కాల గుణాలను సహించి తపస్సు ఆచరిస్తూ ఉన్నారు. ప్రాణాయామాదులద్వారా మీ మనస్సులు పరిశుద్ధం అయ్యాయి. యెండి రాలిన ఆకులనూ, వాయువునూ భక్షిస్తూ వరాలు పొందడానికి నన్ను ఉపాసించారు. మీ మనస్సులను నాయందు లగ్నంచేసి తపస్సు సాగిస్తూఉండగా పంద్రెండు

తతశ్చ శౌరిర్భగవత్ప్రచోదితః
సుతం సమాదాయ స సూతికాగృహాత్
యదా బహిర్గన్తుమియేష తర్హ్యజా
యా యోగమాయాజని నందజాయయా॥ 48

తయా హృతప్రత్యయసర్వవృత్తిషు
ద్వాఃస్థేషు పౌరేష్వపి శాయితేష్వథ
ద్వారస్తు సర్వాః పిహితా దురత్యయా
బృహత్కపాటాయసకీలశృంఖలైః॥ 49

---

సంవత్సరాలు దొర్లిపోయాయి. మీ తపస్సుకు శ్రద్ధకు భక్తికి ప్రసన్నుడనై వరం కోరుకోమని అన్నాను. నీవంటి కుమారుడు కావాలని మీరు వరం కోరారు. అప్పటికి మీకు విషయభోగాలపై వాంఛ లేకపోవడంవల్ల సంతానం లేదు. నా మాయామోహితులై మోక్షం కోరకుండా సంతానం వాంఛించారు. ఆవిధంగానే నేను మీకు వరం ప్రసాదించాను. నేను అంతర్ధానమైన తరువాత మీరు సఫల మనోరథులై విషయభోగానుభవాలలో ప్రవేశించారు. ఈ లోకాలు అన్నిటిలోనూ శీల ఉదారాది సర్వలక్షణలక్షితుడైన నావంటివాడు లేకపోవడంచేత నేనే కుమారుడుగా అవతరించాను. అప్పుడు నాకు పృశ్నిగర్భుడని పేరు. రెండవమారు మీరు అదితి కశ్యపులుగా నున్నపుడు నేను ఉపేంద్రనామంతో అవతరించాను. ఈ మూడవ జన్మలో కూడా మీకు పుత్రరూపంలో అవతరించాను. గతంలో

తాః కృష్ణవాహే వసుదేవ ఆగతే
స్వయం వ్యవర్యన్త యథా తమో రవేః
వవర్ష పర్జన్య ఉపాంశుగర్జితః
శేషోఽన్వగాద్వారి నివారయన్ఫణైః॥ 50

మఘోని వర్షత్యసకృద్యమానుజా
గంభీరతోయౌఘజవోర్మిఫేనిలా
భయానకావర్తశతాకులా నదీ
మార్గం దదౌ సిన్ధురివ శ్రియఃపతేః॥ 51

---

మీకు నేను ఇచ్చిన వరాలు సార్థకమయ్యాయి. నా పూర్వ అవతారాల స్మరణ కలుగుటకై మీకు ఈ చతుర్భుజరూపం చూపించాను. కేవలం మానవ శరీరంతోనే జన్మించాను అనే అజ్ఞానం మీకు కలుగకుండా ఉండుగాక. మీరు నాయందు పుత్రభావంతోనూ బ్రహ్మభావంతోనూ ఉండి నిరంతరం నన్ను చింతిస్తూ నాయందు ప్రేమను వృద్ధిపొందించుకొని అంత్యమందు మోక్షం పొందుదురు గాక. మీకు ఇక్కడ కంసుని భయం ఉంటే నన్ను గోకులం తీసుకు వెళ్ళండి. అక్కడ యశోద గర్భంనుండి ఆవిర్భవించిన నా యోగమాయను తీసికొని తొందరగా యిక్కడకు తిరిగి వచ్చివేయండి— అని పలికి దేవకీ వసుదేవులు చూస్తూ ఉండగానే తన మాయచేత మానవ సామాన్యమైన బాల రూపం ధరించాడు.

సవ్రజం శౌరిరుపేత్య తత్ర తాన్
గోపాన్ప్రసుప్తానుపలభ్య నిద్రయా
సుతం యశోదాశయనే నిధాయ తత్
సుతాముపాదాయ పునర్గృహానగాత్॥ 52
దేవక్యాః శయనే న్యస్య వసుదేవోఽథ దారికామ్
ప్రతిముచ్య పదోర్లోహమాస్తే పూర్వవదావృతః॥ 53

---

వసుదేవుడు శిశురూపంలో ఉన్న శ్రీహరిని తీసుకొని సూతికాగృహంనుండి పయనం సాగించే సమయానికి, యశోద యోగమాయను పుత్రికగా ప్రసవించింది. ఆ యోగమాయచే ఇంద్రియవృత్తులు అన్నీ హరింపబడటం వల్ల ద్వారపాలురూ సమస్త పురవాసులూ నిద్రావస్థకు గురి ఐ పోయారు. కారాగారం ద్వారాలు అన్నీ బంధింపబడి తాళాలు వేయబడ్డాయి. పరిపూర్ణంగా రక్షణలో ఉన్న కారాగారవాసులు ఎవ్వరూ లోపలనుండి బయటకు వచ్చుటకు సావకాశం లేదు. కాని వసుదేవుడు శ్రీకృష్ణుని ఒడిలోకి తీసుకోగానే ద్వారాలన్నీ తెరువబడ్డాయి. సూర్యోదయం ఐనట్లు అంధకారం నశించింది. మేఘాలు మెల్ల మెల్లగా గర్జిస్తూ తుంపరగా వర్షించడం ఆరంభించాయి. శేషుడు స్వయంగా పడగలు విప్పి వర్షపు చినుకులు కృష్ణునిపై పడకుండా వసుదేవుని వెన్నంటి వస్తున్నాడు. నిరంతరం వర్షించే శ్రావణమాసం అగుటచేత యమునానది గంభీరంగా పొంగి పొరలి నురగలు గక్కుతూ ప్రవహిస్తూ ఉంది. భయంకరసుడిగుండాలతో ఉండే యమున

యశోదా నన్దపత్నీ చ జాతం పరమబుధ్యత
న తల్లింగం పరిశ్రాంతా నిద్రయాపగతస్మృతిః॥ 54
ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే
పూర్వార్థే కృష్ణజన్మని తృతీయోఽధ్యాయః॥

---

కృష్ణసమేతుడైన వసుదేవుని చూసీచూడడంతోనే శ్రీరామ చంద్రునకు సముద్రుడు మార్గం ఇచ్చినట్లు వారికి కూడ యమున మార్గం ఇచ్చింది. వసుదేవుడు నందగోష్ఠంలో ప్రవేశించి వారు అందరూ గాఢనిద్రావశులై ఉండడం చూసి శ్రీకృష్ణుని యశోదప్రక్కన పరుండబెట్టి, ఆమె ప్రక్కనున్న బాలికను తీసుకొని శీఘ్రంగా కారాగారానికి తిరిగి వచ్చాడు. ఆ బాలికను దేవకి ప్రక్కలో పరుండబెట్టిన వెంటనే వసుదేవుని పాదాలను సంకెళ్ళు వాటి అంతట అవే వచ్చి బంధించాయి. కారాకారం తలుపులుకూడా వాటంతట అవే బంధింపబడ్డాయి.

గోకులంలో యశోదకు సంతానం కలిగిందనే కాని శ్రమ నిద్రాదులవల్ల పుత్రుడా! పుత్రికా! అనే విషయం గ్రహించ లేక పోయారు — ప్రజానీకం.

ఇది మూడవ అధ్యాయం.

# చతుర్థాధ్యాయము

బహిరన్తఃపురద్వారః సర్వాః పూర్వవదావృతాః
తతో బాలధ్వనిం శ్రుత్వా గృహపాలాః సముత్థితాః॥ 1
తే తు తూర్ణముపవ్రజ్య దేవక్యా గర్భజన్మ తత్
ఆచఖ్యుర్భోజరాజాయ యదుద్విగ్నః ప్రతీక్షతే॥ 2
స తల్పాత్తూర్ణముత్థాయ కాలోఽయమితి విహ్వలః
సూతీగృహమగాత్తూర్ణం ప్రస్ఖలన్ముక్తమూర్ధజః 3
తమాహ భ్రాతరం దేవీ కృపణా కరుణం సతీ
స్నుషేయం తవ కళ్యాణ స్త్రియం మా హన్తుమర్హసి॥ 4

---

భాగవత కథా శ్రవణ కుతూహలం గల పరీక్షిన్మహా రాజుకు శ్రీశుకుడు యిలా చెప్పసాగాడు.

రాజా — వసుదేవుడు నందగృహం నుండి కారాగారంలో ప్రవేశించినతోడనే ద్వారాలన్నీ మూయబడ్డాయి. బాలరోదనం వినిపించింది ద్వారపాలకులకు. వెంటనే వారు కంసునిదగ్గరకు వెళ్లి దేవకి ప్రసవించిందని చెప్పారు. కంసుడు ఈసమయంకొరకే నిరీక్షిస్తున్నాడు. ద్వారపాలురు చెప్పడం పూర్తికాకుండానే కంసుడు శయ్యనుండి లేచి, దేవకియొక్క అష్టమగర్భం తనకు మృత్యుకారణమని గ్రహించడంవల్ల వ్యాకులచిత్తంతో శీఘ్రంగా కారాగారం చేరాడు.

వచ్చిన కంసునిజూచి దేవకి దుఃఖిస్తూ దీనవదనంతో యిలా పలికింది. అన్నా — ఈశిశువు నీకు మేనకోడలు గాని

బహ్వో హింసితా భ్రాతః శిశవః పావకోపమాః
త్వయా దైవనిసృష్టేన పుత్రికైకా ప్రదీయతాం॥ 5
నన్వహం తే హ్యవరజా దీనా హతసుతా ప్రభో
దాతుమర్హసి మన్దాయా అంగేమాం చరమాం ప్రజాం॥

శ్రీశుక ఉవాచ.

ఉపగుహ్యాత్మజామేవం రుదత్యా దీనదీనవత్
యాచితస్తాం వినిర్భర్త్స్య హస్తాదాచిచ్ఛిదేఖలః॥ 7
తాం గృహీత్వా చరణయోర్జాతమాత్రాం స్వసుః సుతామ్
అపోథయచ్ఛిలాపృష్ఠే స్వార్థోన్మూలితసౌహృదః॥ 8

మొనగాడు గాదు. స్త్రీవధ నీకు యోగ్యంగాదు. అగ్నిసమాన తేజంగల నా కుమాళ్ళను దైవవశంచేత సంహరించావు. ఇప్పుడు యీకన్యనైనా నాకు ప్రసాదించు. నేను నీకు చిన్న చెల్లెలనుకాదా! పుత్రశోకంతో కుమిలిపోతున్నానే-యీపిల్లనైనా నాకు వదలెయ్యి — అని పిల్లను ఒడిలోచేర్చుకుని అనునయవాక్యాలు పలికింది.

దేవకి మాటలు లెక్కచేయక కంసుడు బలాత్కారంగా ఆ శిశువును దేవకిచేతులనుండి లాగాడు. సద్యోజాత శిశువనే దృష్టికూడా లేకుండా కంసుడు ఆ బాలికపాదాలు పట్టి పాషాణంమీద పెట్టి కొట్టడానికి విసిరాడు. స్వార్థం సౌహార్దాన్ని హరిస్తుంది గదా! తానొకటి తలచిన దైవమొకటి తలచాడన్నట్లు వానిచేతులనుండి విసరబడ్డ బాలిక

సా తద్ధస్తాత్సముత్పత్య సద్యో దేవ్యంబరం గతా
అదృశ్యతానుజా విష్ణోః సాయుధాష్టమహాభుజా॥ 9
దివ్యస్రగంబరాలేపరత్నాభరణభూషితా
ధనుఃశూలేషుచర్మాసిశంఖచక్రగదాధరా॥ 10
సిద్ధచారణగంధర్వైరప్సరఃకిన్నరోరగైః
ఉపాహృతోరుబలిభిః స్తూయమానేదమబ్రవీత్॥ 11
కింమయా హతయా మన్ద జాతః ఖలు తవాన్తకృత్
యత్ర క్వ వా పూర్వశత్రుర్మా హింసీః కృపణాన్వృథా॥
ఇతి ప్రభాష్య తం దేవీ మాయా భగవతీ భువి
బహునామనికేతేషు బహునామా బభూవ హ॥ 13

---

రాతిమీద పడక ఆకాశానికి ఎగిరింది. ఆమె యోగమాయ. అష్టభుజాలు ధరించింది. దివ్య మాలాంబరాలూ చందన భూషణాదులూ ధరించి, ధనస్సు, శూలం, బాణం, చర్మం, ఖడ్గం, శంఖం, చక్రం, గదా ధరించింది. ఆమెకు నలు దిక్కులా సిద్ధ చారణగణాలూ గంధర్వ కిన్నర నాగ అప్సరగణాలూ స్తుతిస్తూ సేవిస్తున్నాయి.

ఆసమయంలో యోగమాయ కంసుని చూచి యిలా పలికింది— మూర్ఖ నన్ను సంహరించడంవల్ల నీకు ప్రయోజనం ఏం కలుగుతుంతుంది. నీ పూర్వ శత్రువూ, నిన్ను సంహరించడానికి ఆవిర్భవించినవాడూ మరొకచోట పెరుగుతూనే ఉన్నాడు. అన్యాయంగా అనేకులైన శిశువులను సంహరించావు. యిక నిర్దోషులైన బాలలను హత్య చెయ్యకు–

తయాభిహితమాకర్ణ్య కంసః పరమవిస్మితః
దేవకీం వసుదేవం చ విముచ్య ప్రశ్రితోఽబ్రవీత్॥ 14
అహో భగిన్యహో భామ మయా వాం బత పాప్మనా
పురుషాద ఇవాపత్యం బహవో హింసితాః సుతాః॥ 15
స త్వహం త్యక్తకారుణ్యస్త్యక్తజ్ఞాతిసుహృత్ఖలః
కాంల్లోకాన్వై గమిష్యామి బ్రహ్మహేవ మృతః శ్వసన్॥
దైవమప్యనృతం వక్తి న మర్త్యా ఏవ కేవలమ్
యద్విశ్రంభాదహం పాపః స్వసుర్నిహతవాఞ్ఛిశూన్॥
మా శోచత మహాభాగావాత్మజాన్స్వకృతమ్భుజః
జన్తవో న సదైకత్ర దైవాధీనాస్తదాసతే 18

---

అని చెప్పి యోగమాయ అంతర్ధానమై అనేకపట్టణాలలో పల్లెలలో అనేకరూపాలతో అనేకనామాలతో అవతరించి ప్రసిద్ధిచెందింది.

యోగమాయ పలుకులు విని కంసుడు ఆశ్చర్యం పొంది దేవకీవసుదేవులను బంధవిముక్తులనుచేసి వారితో వినయంగా ఇలా పలికాడు - సోదరీ, బావా - మీ విషయంలో చాలా అన్యాయం చేశాను. రాక్షసునివలె మీకుమారులను సంహరించాను. కరుణ లేకుండా జాతిస్నేహం కూడా చూడక శిశుహత్య చేసిన నేను ఏ లోకానికి పోతానో నాకే తెలీడం లేదు. బ్రహ్మహత్య చేసినవానివలె నేను బ్రతికీ చచ్చినవానితో సమానం. మనుష్యులేకాకుండా విధాత కూడా అబద్ధమే ఆడాడు. అశరీరవాణి పలుకులు నమ్మి

తయాభిహితమాకర్ణ్య కంసః పరమవిస్మితః
దేవకీం వసుదేవం చ విముచ్య ప్రశ్రితోఽబ్రవీత్॥ 14
అహో భగిన్యహో భామ మయా వాం బత పాప్మనా
పురుషాద ఇవాపత్యం బహవో హింసితాః సుతాః॥ 15
స త్వహం త్యక్తకారుణ్యస్త్యక్తజ్ఞాతిసుహృత్ఖలః
కాంల్లోకాన్వై గమిష్యామి బ్రహ్మహేవ మృతః శ్వసన్॥
దైవమప్యనృతం వక్తి న మర్త్యా ఏవ కేవలమ్
యద్విశ్రంభాదహం పాపః స్వసుర్నిహతవాఞ్ఛిశూన్॥
మా శోచత మహాభాగావాత్మజాన్స్వకృతమ్భుజః
జన్తవో న సదైకత్ర దైవాధీనాస్తదాసతే 18

---

అని చెప్పి యోగమాయ అంతర్ధానమై అనేకపట్టణాలలో పల్లెలలో అనేకరూపాలతో అనేకనామాలతో అవతరించి ప్రసిద్ధిచెందింది.

యోగమాయ పలుకులు విని కంసుడు ఆశ్చర్యం పొంది దేవకీవసుదేవులను బంధవిముక్తులనుచేసి వారితో వినయంగా ఇలా పలికాడు - సోదరీ, బావా - మీ విషయంలో చాలా అన్యాయం చేశాను. రాక్షసునివలె మీకుమారులను సంహరించాను. కరుణ లేకుండా జాతిస్నేహం కూడా చూడక శిశుహత్య చేసిన నేను ఏ లోకానికి పోతానో నాకే తెలీడం లేదు. బ్రహ్మహత్య చేసినవానివలె నేను బ్రతికీ చచ్చినవానితో సమానం. మనుష్యులేకాకుండా విధాత కూడా అబద్ధమే ఆడాడు. అశరీరవాణి పలుకులు నమ్మి

మోచయామాస నిగడాద్విశ్రబ్ధః కన్యకాగిరా
దేవకీం వసుదేవం చ దర్శయన్నాత్మసౌహృదమ్॥ 24
భ్రాతుః సమనుతప్తస్య క్షాన్తరోషా చ దేవకీ
వ్యసృజద్వసుదేవశ్చ ప్రహస్య తమువాచ హ॥ 25
ఏవమేతన్మహాభాగ యథా వదసి దేహినాం
అజ్ఞానప్రభవాహంధీః స్వపరేతి భిదా యతః॥ 26
శోకహర్షభయద్వేషలోభమోహమదాన్వితాః
మిథో ఘ్నన్తం న పశ్యన్తి భావైర్భావం పృథగ్దృశః॥

శ్రీశుక ఉవాచ.

కంస ఏవం ప్రసన్నాభ్యాం విశుద్ధం ప్రతిభాషితః
దేవకీవసుదేవాభ్యామనుజ్ఞాతోఽవిశద్గృహం॥ 28

---

జన్మాంతర కర్మఫలమే కారణం. సమస్త జీవులూ వారి కర్మ ఫలమే అనుభవిస్తూ ఉంటారు. జీవుడు స్వయంప్రకాశ స్వరూపుడై ఉండీ 'నేను చంపబడుతున్నాను, నేను చంపుతున్నాను—' అని ఎంతవరకూ అనుకుంటూ ఉంటాడో, అంతవరకూ కూడా, దేహోత్పత్తీ నాశనాలయొక్క అభిమానం ఉంటుంది. అప్పుడు ఆజీవికి అజ్ఞానవశంచేత బాధ్యబాధకభావాలు ప్రాప్తిస్తూ ఉంటాయి. మీరిద్దరూ సాధుస్వభావులూ దీనరక్షకులూ అవడం చేత కుటిలాత్ముడనైన నన్ను రక్షించి క్షమించండి — అని పలుకుతూ కంసుడు కనులనుండి నీరుకారుస్తూ దేవకీవసుదేవుల పాదాలు పట్టుకున్నాడు. కన్యారూపంలో ఉన్న యోగమాయ పలుకుల విశ్వసించి దేవకీవసుదేవులను బంధవిముక్తిల్ని చేశాడు

తస్యాం రాత్ర్యాం వ్యతీతాయాం కంస ఆహూయ
మంత్రిణః
తేభ్య ఆచష్ట తత్సర్వం యదుక్తం యోగనిద్రయా॥ 29
ఆకర్ణ్య భర్తుర్గదితం తమూచుర్దేవశత్రవః
దేవాన్ప్రతి కృతామర్షా దైతేయా నాతికోవిదాః॥ 30
ఏవం చేత్తర్హి భోజేంద్ర పురగ్రామవ్రజాదిషు
అనిర్దశాన్నిర్దశాంశ్చ హనిష్యామోఽద్య వై శిశూన్॥
కిముద్యమైః కరిష్యన్తి దేవాః సమరభీరవః
నిత్యముద్విగ్నమనసో జ్యాఘోషైర్ధనుషస్తవ॥ 32

---

సోదరుని పశ్చాత్తాపం చూసి దేవకి క్రోధం శమించింది. గతంలో కంసుడు చేసిన అపరాధాలనుకూడా మరచిపోయింది. వసుదేవుడుకూడా చిరునవ్వు నవ్వుతూ బావా నీవు చెప్పినదంతా సత్యం. దేహధారులకు అజ్ఞానంవల్లనే 'అహం' బుద్ధి కలుగుతుంది. దానివల్లనే యిదినాది – యిదివానిదీ – అనే భేదబుద్ధి కలుగుతుంది. భేదదృష్టి కలవారు హర్ష శోక భయ ద్వేష లోభ మోహ మదాలకు లోనై అంధులై పోతారు. అట్టివారు తమలో తాము ఒకరి నొకరు నశింప చేసుకుంటూ సర్వప్రేరకుడైన పరమాత్మను మరచిపోతారు. ఆభగవంతుని చూడలేరు.

దేవకీవసుదేవు లీవిధంగా ప్రసన్నులై శుద్ధభావంతో సంభాషించిన పిమ్మట కంసుడు వారి అనుమతి పొంది తన గృహానికి వెళ్ళిపోయాడు. ఆ రాత్రి గడచింది. మరునాడు మంత్రులను పిలచి యోగమాయ చెప్పిన మాటలనూ,

అస్యతస్తే శరవ్రాతైర్హన్యమానాః సమన్తతః
జిజీవిషవ ఉత్సృజ్య పలాయనపరా యయుః॥ 33
కేచిత్ప్రాంజలయో దీనా న్యస్తశస్త్రా దివౌకసః
ముక్తకచ్ఛశిఖాః కేచిద్భీతా స్మఇతి వాదినః॥ 34
న త్వం విస్మృతశస్త్రాస్త్రాన్విరథాన్భయసంవృతాన్
హంస్యన్యాసక్తవిముఖాన్భగ్నచాపానయుధ్యతః॥ 35
కిం క్షేమశూరైర్విబుధైరసంయుగవికత్థనైః
రహోజుషా కిం హరిణా శంభునా వా వనౌకసా
కిమింద్రేణాల్పవీర్యేణ బ్రహ్మణా వా తపస్యతా॥ 36

---

దేవకీవసుదేవులను చెరనుండి విడచుటా మొదలైనవన్నీ చెప్పాడు. దేవద్రోహులైన వారు వాని మాటలు విని, మందమతులు కావడంచేత దేవతలమీద కోపించి యిలా పలుకుతున్నారు.

కంసమహారాజా — ఇది యదార్థమే ఐతే వ్రజమండలంలోని నగర గ్రామాదులన్నీ మేము వెతకి పదిరోజులలోపువయస్సుగల పిల్లలనందరనూ చంపివేస్తాం. యుద్ధమంటే భయపడే యీ దేవతలు మనల నేమీ చేయలేరు. మీ ధనుష్టంకారం వినినమాత్రంచే వారు భయకంపితులౌతారు. యుద్ధసమయంలో మీ బాణఘాతాలను సహించలేక పరువెత్తిన వారే జీవిస్తారు. లేకపోతే వారికి ప్రాణాలమీద ఆశఉండదు. కొందరు దేవతలు శస్త్రాస్త్రాల విడచి మీకు చేతులు జోడించి క్షమాభిక్ష వేడతారు; మరికొందరు జుట్లు విరియబోసుకొని మిమ్ము శరణంటారు;

తథాపి దేవాః సాపత్న్యాన్నోపేక్ష్యా ఇతి మన్మహే
తత స్తన్మూలఖననే నియుఙ్క్ష్వాస్మాననువ్రతాన్॥ 37
యథామయోఽఙ్గే సముపేక్షితో నృభి
ర్న శక్యతే రూఢపదశ్చికిత్సితుమ్
యథేన్ద్రియగ్రామ ఉపేక్షిత స్తథా
రిపుర్మహాన్బద్ధబలో న చాల్యతే॥ 38
మూలం హి విష్ణుర్దేవానాం యత్ర ధర్మః సనాతనః
తస్య చ బ్రహ్మగోవిప్రా స్తపోయజ్ఞాః సదక్షిణాః॥ 39
తస్మాత్సర్వాత్మనా రాజన్బ్రాహ్మణాన్బ్రహ్మవాదినః
తపస్వినో యజ్ఞశీలాన్గాశ్చ హన్మో హవిర్దుఘాః॥ 40

---

అప్పుడు మీరు యుద్ధనీతిని అనుసరించి శస్త్రాస్త్రములు లేని వారినీ విరథుల్ని భయభీతులైనవారినీ తలవంచినవారినీ ధనస్సులు విరిగిపోయినవారినీ సంహరించక విడిచివేస్తారు. ఏరా దేవతలకు యెక్కడ భయం ఉండదో అక్కడే మహా వీరులవలె నిలుస్తారు. యుద్ధరంగం కాకపోతే పెద్ద పెద్ద కబుర్లు చెపుతారు కనుక వీరివల్ల మనకు భయంలేదు. విష్ణు వెప్పుడూ ఏకాంతంలోనే ఉంటాడు. సదాశివుడు వనవాసి. బ్రహ్మ తపస్వి. ఇంద్రుడు అల్పబలుడు. ఇలాంటి దేవతలా మనలను హింసించేది— వీరెన్నడూ మనలను ఏమీ చేయ లేరు. ఐనా వారు మనకు శత్రువులు కనక దేవతల నుపేక్షించరాదు. దేవగణాలను మూలచ్ఛేదం చెయ్యడానికి మాకు అనుజ్ఞ ఇవ్వండి. ఉపేక్షవల్ల మనుష్యదేహమందు వ్యాధి అసాధ్యమైనట్లే ఉపేక్షచేత ఇంద్రియాలు అదమ్యాము

విప్రా గావశ్చ వేదాశ్చ తపః సత్యం దమః శమః
శ్రద్ధా దయా తితిక్షా చ క్రతవశ్చ హరేస్తనూః॥ 41
స హి సర్వ సురాధ్యక్షో హ్యసురద్విడ్గుహాశయః
తమ్మూలా దేవతాః సర్వాః సేశ్వరాః సచతుర్ముఖాః
అయం వై తద్వధోపాయో యదృషీణాం విహింసనమ్॥

శ్రీశుక ఉవాచ.

ఏవం దుర్మన్త్రిభిః కంసః సహ సమ్మన్త్ర్య దుర్మతిః
బ్రహ్మహింసాం హితం మేనే కాలపాశావృతోఽసురః॥

---

లైవల్లే శత్రువులు కూడా బలాధికులై మనకే ప్రమాదం తేగలుగుతారు; దేవతలకు మూలం విష్ణువు. ఆతడు సనాతన ధర్మం ఎక్కడుంటే అక్కడే ఉంటాడు. సనాతన ధర్మమూలం వేదములూ గోవులూ బ్రాహ్మణులూ తపస్సూ దక్షిణలతో కూడిన యజ్ఞాలూ అవడంవల్ల మేము వేదవేత్తలైన బ్రాహ్మణులనూ తపస్వులనూ యజ్ఞపరాయణులనూ హవ్యాలిచ్చే గోవులనూ సంహరిస్తాం. బ్రాహ్మణులూ గోవులూ వేదాలూ సత్య తపో దానాలూ దమ శమ శ్రద్ధా దయలూ తితిక్షా యజ్ఞాలూ విష్ణువుయొక్క శరీరం. ఆ దైత్యద్రోహీ సర్వాంతర్యామీ యగు విష్ణువే దేవతలకు నాయకుడు. సదాశివుడు బ్రహ్మ మొదలైన దేవతలందరూ నారాయణునే ఆశ్రయించి ఉంటారు. నారాయణుని వధించడానికి ఉపాయము ఋషులను సంహరించడమే— అని మంత్రులు పలుకగా విని కాలపాశానికి

సన్దిశ్య సాధులోకస్య కదనే కదనప్రియాన్
కామరూపధరాన్దిక్షు దానవాన్గృహమావిశత్॥ 44
తే వై రజః ప్రకృతయ స్తమసా మూఢచేతసః
సతాం విద్వేషమాచేరురారాదాగతమృత్యవః 45
ఆయుః శ్రియం యశో ధర్మం లోకానాశిష ఏవ చ
హన్తి శ్రేయాంసి సర్వాణి పుంసో మహదతిక్రమః॥ 46
ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే
పూర్వార్ధే చతుర్థోధ్యాయః॥

---

వశుడైన కంసుడు 'బ్రహ్మహత్య' అని కూడా శంకించక అనుమతించాడు. హింసాప్రియులూ కామరూపులూ అయిన రాక్షసులకు సాధుజనసంహారానికి అనుజ్ఞ యిచ్చి కంసుడు తన అంతఃపురానికి వెళ్ళిపోయాడు. స్వతః రాక్షసులప్రకృతి రజోగుణప్రధానమైంది. పైగా తమోగుణంచే ఆచ్ఛాదింపబడ్డం కూడా దానికి తోడైతే అడిగే దేముంది— వారు సదసద్వివేకశూన్యులైపోతారు. వారికి మృత్యువుకూడా సమీపించింది. కనుకనే వారు సాధుజనులను ద్వేషించడం ఆరంభించారు. పరీక్షిన్మహారాజా — మహాపురుషులను అనాదరిస్తే ఆయుర్దాయం శ్రీ యశస్సు ధర్మం స్వర్గాది పుణ్యలోకాలూ కోర్కెలూ నష్టమైపోతా యని చెప్పి శ్రీశుకుడు ముందుకు సాగుతున్నాడు.

ఇది నాలుగవ అధ్యాయం.



# పంచమాధ్యాయము

శ్రీశుక ఉవాచ.

నన్దస్త్వాత్మజ ఉత్పన్నే జాతాహ్లాదో మహామనాః
ఆహూయ విప్రాన్వేదజ్ఞాన్ స్నాతః శుచిరలఙ్కృతః॥ 1
వాచయిత్వా స్వస్త్యయనం జాతకర్మాత్మజస్య వై
కారయామాస విధివత్పితృదేవార్చనం తథా॥ 2
ధేనూనాం నియుతే ప్రాదాద్విప్రేభ్యః సమలఙ్కృతే
తిలాద్రీన్సప్త రత్నౌఘశాతకౌమ్భామ్బరావృతాన్॥ 3
కాలేనస్నానశౌచాభ్యాం సంస్కారైస్తపసేజ్యయా
శుధ్యన్తి దానైః సన్తుష్ట్యాద్రవ్యాణ్యాత్మాత్మవిద్యయా॥

---

శ్రీశుకుడు ఇలా చెపుతున్నాడు — మహారాజ — పుత్రజననం వల్ల నందునకు బ్రహ్మానందం కలిగింది. ఆయన జ్యోతిష శాస్త్రవేత్తలను పిలిపించాడు. మంగళస్నానం చేసి పవిత్రవస్త్రాలు ధరించి, వేదవేత్తలైన విద్వాంసులచేత స్వస్తి వాచనం చేయించి, విధివిధానంగా జాతకర్మ పరిసమాప్తిచేసి, దేవ పితృగణాలను అర్చించాడు. సర్వాలంకారశోభితమైన ఇరవైవేల గోవులను బ్రాహ్మణులకు దానాలు ఇచ్చాడు. అనేక రత్నాలూ బంగారునాణాలూ చీనిచీనాంబరాలూ కూడ బ్రాహ్మణులకూ ముత్తైదువులకూ పంచిపెట్టించాడు. ఏడు తిలపర్వతాలు కూడా దానంచేశాడు. (తిలలు రాసిగా పోసి ఒకవైపున ఒకడు మరొకవైపున మరొకడూ నిలిస్తే

సౌమంగళ్యగిరో విప్రాః సూతమాగధవందినః
గాయకాశ్చ జగుర్నేదుర్భేర్యో దున్దుభయో ముహుః॥
వ్రజః సమ్మృష్టసంసిక్తద్వారాజిరగృహాన్తరః
చిత్రధ్వజపతాకాస్రక్చైలపల్లవతోరణైః॥ 6
గావో వృషా వత్సతరా హరిద్రాతైలరూషితాః
విచిత్రధాతుబర్హస్రగ్వస్త్రకాంచనమాలినః॥ 7
మహార్హవస్త్రాభరణకంచుకోష్ణీషభూషితాః
గోపాః సమాయయూ రాజన్నానోపాయనపాణయః॥

---

ఒకరికొకరు కనిపించకుండా ఉంటే అదే తిల పర్వతము అన బడుతుంది) భూమి కాలంచేత, శరీరం స్నానంచేత, అపవిత్రపదార్థాలు శౌచవిధిచేత, గర్భాదులు సంస్కారం చేత, ధనం దానంవల్లనూ, చిత్తం సంతోషంవల్లనూ, ఇంద్రియాలు తపస్సుచేతనూ, బ్రాహ్మణులు యజ్ఞాలచేతనూ ఆత్మ ఆత్మవిద్యవల్లనూ పరిశుద్ధములు అవుతాయి. ఆసమయంలో బ్రాహ్మణులూ వందిమాగధులూ మంగళ ఆశీర్వాదాలూ స్తుతులూ గానాలూ చేస్తున్నారు. భేరీ మృదంగాది మంగళధ్వనులు మారుమ్రోగుతున్నాయి. ఆరోజున వ్రజమండలంలో అన్నిగృహాలనూ అలంకరించారు. ధ్వజ పతాక తోరణాలతో నగరం అంతా సర్వాలంకార శోభితమై నూతన ఆనందం కలిగిస్తోంది. గోవులూ వృష భాలూ గోవత్సలూ పసుపు కుంకుమలచేతనూ గైరికాది ధాతువులచేతనూ అలంకరింపబడి నెమలిపింఛాలు కట్టబడి

గోప్యశ్చాకర్ణ్య ముదితా యశోదాయాః సుతోద్భవం
ఆత్మానం భూషయాంచక్రుర్వస్త్రాకల్పాంజనాదిభిః॥ 9
నవకుంకుమకింజల్కముఖపంకజభూతయః
బలిభిస్త్వరితం జగ్ముః పృథుశ్రోణ్యశ్చలత్కుచాః॥ 10
గోప్యః సుమృష్టమణికుండలనిష్కకంఠ్య
శ్చిత్రాంబరాః పథి శిఖాచ్యుతమాల్యవర్షాః
నన్దాలయం సవలయా వ్రజతీర్విరేజు
ర్వ్యాలోలకుండలపయోధరహారశోభాః॥ 11
తా ఆశిషః ప్రయుంజానాశ్చిరం పాహీతి బాలకే
హారిద్రాచూర్ణతైలాద్భిః సించన్త్యో జనముజ్జగుః॥ 12

---

నూతన ఉత్సాహం కలిగిస్తున్నాయి. గోపకులు స్వర్ణాలంకారాలూ దివ్యవస్త్రాలూ ధరించి కానుకలు తీసుకుని నందునిగృహానికి వస్తున్నారు. యశోదకు కుమారుడు కలిగాడని తెలిసిన వెంటనే గోపికలు సర్వాలంకారశోభితులై దివ్యమాల్యానులేపనవస్త్రాలూ అంజనాదులూ ధరించారు. వారి ముఖకమలాలు నవకుంకుమ రూపమైన కేసరాలచే నూతనశోభలతో ప్రకాశిస్తున్నాయి. అనేక కానుకలుతో వారందరూ యశోదగృహానికి పయనించారు. స్థూలమైన నితంబభాగాలతో గోపాంగనలు గమనంసాగిస్తూంటే పీన పయోధరాలు చలిస్తున్నాయి. కర్ణములయందలి మకర కుండలాలూ గళాలయందలి పతకాలతోకూడిన బంగారు హారాలూ ప్రకాశిస్తున్నాయి. చిత్రగతులలో వారు నడు

అవాద్యన్త విచిత్రాణి వాదిత్రాణి మహోత్సవే
కృష్ణే విశ్వేశ్వరేఽనన్తే నన్దస్య వ్రజమాగతే॥ 13
గోపాః పరస్పరం హృష్టా దధిక్షీరఘృతామ్బుభిః
ఆసించన్తో విలిమ్పన్తో నవనీతైశ్చ చిక్షిపుః॥ 14
నన్దో మహామనాస్తేభ్యో వాసోఽలఙ్కారగోధనం
సూతమాగధవన్దిభ్యో యేఽన్యే విద్యోపజీవినః॥ 15
తైస్తైః కామైరదీనాత్మా యథోచితమపూజయత్
విష్ణోరారాధనార్థాయ స్వపుత్రస్యోదయాయ చ॥ 16

---

స్తూంటే కేశపాలనుండి పుష్పవర్షం కురుస్తోంది. కరకంకణాలు కింకిణీ ధ్వనులు చేస్తున్నాయి. కుండలాలూ ఉరోజాలూ హారాలూ అల్లలనాడుతున్నాయి. అట్టి అపూర్వ శోభలతో ప్రకాశించే గోపాంగనలు నందగృహం చేరి యశోదను చూచి 'నీ కుమారుడు చిరంజీవి యగుగాక' యని ఆశీర్వదించారు. వారంతా ఆ ఉత్సాహంలో ఒకరిపై నొకరు వసంతం చల్లుకుంటూ ఉచ్చైస్వరంతో పాటలు పాడుతూ ఆనందిస్తున్నారు.

జగన్నాథుడైన శ్రీకృష్ణు డెప్పుడైతే నందవ్రజానికి వచ్చాడో ఆసమయాన జన్మమహోత్సవంతో అనేక మంగళ ధ్వనులు మారుమ్రోగాయి. గోప గోపికలు పాలు పెరుగు వెన్న మొదలైనవి ఒకరిపై నొకరు విసరుకొంటున్నారు. ఒకరి ముఖాన మరొకరు వెన్న రాస్తున్నారు. నందుడు వారందరకూ గోవులూ వస్త్రాలూ భూషణాదులూ యిచ్చాడు.

రోహిణీ చ మహాభాగా నన్దగోపాభినన్దితా
వ్యచరద్దివ్యవాసఃస్రక్కంఠాభరణభూషితా॥ 17
తత ఆరభ్య నన్దస్య వ్రజః సర్వసమృద్ధిమాన్
హరేర్నివాసాత్మగుణై రమాక్రీడమభూన్నృప॥ 18

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే దశమస్కంధే
పూర్వార్ధే పంచమాధ్యాయే శ్రీకృష్ణ జన్మోత్సవం
సమాప్తం.

---

వంది సూత మాగధులనూ నృత్య గాన వాద్య విశారదులైన వారినీ అందరనూ సత్కరించాడు నందుడు. కుమారుని అభ్యుదయానికై విష్ణువు ప్రసన్నుడగుటకు అనేక సత్కారాలు చేశాడు. నందుని సత్కారాలను పొందిన రోహిణీదేవి గృహ యజమానురాలివలె వచ్చే వెళ్లే వారిని గౌరవిస్తోంది. శ్రీకృష్ణుడు అవతరించిన క్షణంనుండి వ్రజభూమి సర్వసంపత్తులకూ ఆకరమై శ్రీమహాలక్ష్మికి క్రీడాస్థలం అయింది. శ్రీకృష్ణజనన హేతువుచే నందగోకులంలో సర్వసంపదలూ వృద్ధినొంది సంసారుల సమస్తపాపాలూ పటాపంచలు ఐయాయి. మానవుల సమస్తకోర్కెలు శ్రీకృష్ణ జననంవల్ల ఫలరూపం పొందాయి.

శ్రీకృష్ణ జనన మహోత్సవం సమాప్తం.



# కృతజ్ఞత

మహాభాగవత మందలి శ్రీకృష్ణజనన ఘట్టం
అనువాదం చేసిన పూజ్యపాదులు

## శ్రీ పురాణపండ రామమూర్తి గారికీ

ముద్రణ భారం వహించిన

## శ్రీ ఆకివీడు వెంకట సత్యనారాయణ గారికీ

మా "విశ్వశ్రీ గ్రంథమాల" తరఫున నమోవాకాలు.

కార్యదర్శులు

దువ్వూరి సోమయాజులు
జగన్నాథపురం—కాకినాడ.

నందూరి నరశింహాచార్యులు
ఆచారి బ్రదర్సు—రాజమండ్రి.

మవ్వం జగన్నాథం
విజయనగరం.

భారతీ ప్రెస్, రాజమండ్రి.